# భూమిక

(శ్రీరామతీర్థస్వామి సంక్షిప్త జీవితచరిత్ర)

శ్రీరామతీర్థస్వామి మన భరతఖండములో నుద్భవించిన మహాజ్ఞానులలో నొకఁడు. శ్రీరామభక్తాగ్రేసరుఁడగు తులసీదాసుగారి వంశపరంపరలోనివాఁడు. పాంచాలదేశమందలి గుజరాన్వాలా మండలములోఁజేరిన మురళీవాలాయను గ్రామమునందొక పేదబ్రాహ్మణకుటుంబమున నాతఁడు 1873 సం॥ములో జననమంది దుర్భరదారిద్ర్య మనుభవించుచు, ననేకమార్లు నిండుపస్తు, ఒంటిపూట భోజనములతోడనే తృప్తిజెందుచు, గట్టుకొనుటకు మొత్తమువీద మూఁడురూపాయలకంటె నెక్కువ విలువసేయని యొక పరాయి,లాగు, నుత్తరీయములను బ్రతిదినమును దానె యుదుకుకొని ధరించుకొనుచు నెన్నికష్టములకు లోనైనను వెనుదీయక యిరువదిరెండవయేటనే ఎం. ఎ. పరీక్షలో గృతార్థుఁడయి, గృహస్థాశ్రమమును స్వీకరించి, యటుపైన నాలుగుసంవత్సరములు తాను జదువుకొన్న కాలేజీలోనే గణితశాస్త్రోపాధ్యాయపదమలంకరించి, యాదినములలో ఇంగ్లీషు, హిందీ, పార్సి, ఉర్దు, సంస్కృతభాషలలోగల సమస్తశాస్త్రవేదాంతకవితాగ్రంములెల్లఁ బరిశీలించి చదివి, విద్యలలోకెల్ల నుత్తమమగు బ్రహ్మవిద్యఁ జేపట్టి, కాలేజి ప్రొఫెసరుపనికి రాజీనామాచ్చి, రెండు సంవత్సరములు హిమాలయపార్శ్వతారణ్యములో ఘోరతపంబొనర్చి, యటుపిమ్మట 1902 సంవత్సరములో శ్రీవివేకానందస్వామి పరమపదించిన కొలదిమాసములలో జపానుమీదుగ నమెరికాకు ఒంటరిగ జని పశ్చిమార్థశమందలి నవనాగరికశాస్త్రవేత్తలందఱు దిగ్భ్రమజెంద

నట్లు వేదాంతసందేశమును మేఘగంభీరనాదముతో ప్రతిపట్టణములో జాటి, 1904 సం॥ ములో ఈజిప్టుమీదుగ నిండియాకు మరలివచ్చి, కొంతకాలము ఉత్తరహిందూస్థానమందలి కొన్ని పట్టణములలో నుపన్యాసములిచ్చి, తరువాత 2 సం॥ ములు గంగానదీతీరమున దదేకనిష్ఠుఁడై యాత్మానుసంధానం బొనర్చుకొనుచుండి, 1906 సం॥ లో నొకనాఁ డాకస్మికముగ గంగానదిలో కాలుజారి పడి, ముప్పదిమూడవయేట నకాలమృత్యువువాత బడెను.

ఈమహానుభావుఁ డిచ్చిన యుపన్యాసములు, వ్రాసిన వ్రాతలు, చేసిన పనులు, చాలవఱ కింగ్లీషు, ఉర్దూ, పార్సీ భాషలలో బ్రకటింపఁబడియున్నవి. సి. ఎఫ్. ఆండ్రూసుగారు, స్వామి శ్రద్ధానంద, మున్నగువా రీతనినిగూర్చి "వివేకానంద స్వామికంటె గొన్ని విషయములలో నీతఁ డతివిచిత్రపురుషుఁ" డని యభిప్రాయపడియున్నారు. ఈమహానుభావుని రచన లింగ్లీషులో నాలుగు పెద్దవాల్యూములుగను, వాని యనువాదములు నితరరచనములును హిందీలో నిప్పటికి 20 వాల్యూములుగను బ్రకటింపఁబడియున్నవి. తెనుగులో ననువదించుట కిదియె ప్రథమయత్నము.

మా శక్తివంచనలేకుండ వానినన్నిటి నాంధ్రములోనికనువదింపించి యాంధ్రసోదర సోదరీమణుల కరకమలముల నిడవలయునని యుత్సాహము కలదు. దయామయుఁడగు పరమేశ్వరుని కటాక్షమున్నచో మాకోర్కె ఫలించుట యొక కష్టముకాదు. ఈ యనువాదములలోగల లోపములను పాఠకులు క్షమింపఁ బ్రార్థించుచున్నారము.

విజయవాడ, 1—10—23 —స్వామిభక్తుఁడు.



ఓం

శ్రీకృష్ణపరమాత్మనేనమః.

# సుఖము-ఆంతరంగికము.



తమ సేనానివహము లితరజాతులను జయించి వశ్య మొనర్చుకొనుచున్నందులకు క్రైస్తవ జాతులనుగాని, యైరోపా జాతులనుగాని నేను నిందింపను. జ్ఞానవికాసముచెందు జాతి ట్లుచేయుట యనునది విధాయకమగు నొకయవస్థగా నెఱుంగవలెను. హిందూదేశ మాయవస్థను గడచినది; కాని ప్రాక్తనచరిత్రేతిహాసముకల భారతవర్షము ప్రపంచభాగ్యము లంతను మలయందుంచూచి కొఱమాలినదని నిశ్చయించినది. ప్రాపంచిక భోగభాగ్యసంగ్రహణాభిలాషగల జాతులన్నియు నీవిషయమును దమయనుభవమువల్ల నేర్చుకొనవలసియున్నది. ఈ జాతులన్నియు నితరజాతులను జయించుతలంపుతోఁ దమ సైన్యప్రవాహముల నెందులకుఁ బంపుచున్నవి? దేని నన్వేషించుకొఱకు వా రట్లుచేయుచున్నారు? ప్రీతికొఱకు, సంతోషము కొఱకు, సుఖముకొఱకు, సుఖము కాదు. జ్ఞానమునపేక్షించుచున్నారని కొందఱనవచ్చును. ధర్మజిజ్ఞాస వారినట్లు ప్రేరించినదని మఱికొందఱనవచ్చును. పోఁగాక. కాని సామాన్యమానవుల మనస్సులను, వారి హృదయములను బరీక్షింపుఁడు. అప్పుడు వారందఱు బుద్ధిపూర్వకముగాఁగాని, యట్లుకాకకాని, యాశించు గమ్యస్థానము సుఖమేయని తేలును. అయ్యది సద్యఃఫలితమనను గావచ్చును. లేదా సుఖముగాఁబర్యవసించు

మఱియొక ఫలము లేక యనుభవము కావచ్చును. ఇది నిక్కువము.

"సుఖ" మనునది రాజసౌధములయం దుండునా, పేద లకుటీరములయం దుండునా, సుందరతరుణీవిలాసము లందుఁ గలుగునా, స్వర్ణరజతంబులచే సులభలభ్యంబులగు పదార్థజాలమందుఁగలదా? సుఖమునకసలు నివాసస్థానమేది ?

సుఖమునకుఁగూడఁ గొంత ప్రయాణ చరిత్రకలదు. ఇవి గొప్ప ప్రయాణపుదినములు. ఆవిరిచే నడపఁబడు ధూమనౌకాశకటములు, విద్యుచ్ఛక్తిచే నడపఁబడు తంతులు, యంత్రములు దూరగమన శ్రవణంబులఁ జులకన జేసి దేశకాలముల పరిమాణములకుఁ బాటిలేకుండఁ జేసినవని యెల్లరకుఁదెల్లమేకదా? మహాపర్యటన దినములలో నెల్లవారును దమ యాత్రాభివనముల వ్రాయుచుండుట మనము కనుచున్నాము. సుఖము మాత్ర మేల ప్రయాణము సలుపకుండును? సుఖము తనయానెట్లు వివరించునో చూచెదముగాక.

ఒక చంటిపిల్లవాఁడు తన శైశవావస్థ యందుఁగాంచ సుఖమెట్లుండునో కనుగొందము. ఆపసిబిడ్డని సుఖమంతయు దన తల్లియొడియందుఁగాని, చంకయందుఁగానితప్ప వేఱెచ్చటను లేదు. ఇది సుఖము, ప్రయాణమొనర్చు రాచబాటయందలి మొదటినుకాము. శిశువునకు జననియొడియందు గాని, ఉయ్యాలమధ్యమునఁగాని నివసించుటకంటె నెక్కు సుఖమొసంగఁజాలు వస్తువీప్రపంచమునం దెద్దియులేద. చంటిపిల్లలకుఁ బుస్తకములు నిరుపయోగమగు వస్తువుల

గడఁగుచున్నాఁడు. గొప్పవేతనముకల యుద్యోగము సంపాదించినాఁడు. ఇంకవలయున దేమున్నది? ఓహో ఆగుడు. ఆతని సుఖస్థానము మరల జరిగిపోయినది. ఎంతో ధనసంచయముచేసినను సంతృప్తిలేదా యీతనికని యడుగకుఁడు. లక్ష్మి కిడుఁజపల యందురు. కాని సుఖము చపలతర యయినట్లున్నదే! కానిండు. ఇప్పుడాతని మానసమెద్దానిపై స్నిగ్ధమైయున్నదో వేఱనుడువవలయునా? స్త్రీపైన "దివ్యసుందఱియగు లలనారత్నమొక్కతెం బరిణయము చేసికొని గార్హస్థ్యసుఖమను భవింపనిచో నీధనమెవ్వనికొఱ"కని తలంచుచున్నాఁడు. మేలు. కోరిక కలుగవలెఁగాని విత్తవంతునకుఁ గోరినయువతి భార్య యగుట కాలస్యముండునా? కోరిన తరుణిలభించినప్పుడు కూడ సుఖముండదా యనకుఁడు. కొంతకాలము సుఖపడినాఁడు. నిజమే. ఆమానినీతిలకము మందహాసము కొఱకెంత ద్రవ్యమైన వెచ్చపెట్టినాఁడు. ఆమెసుఖమే తనసుఖముగా భావించి సర్వదాయామె కోరినదానినెల్ల సేకరించుచుండెను. ఆమెతోడనే ప్రపంచమనుకొనినాఁడు. ఆమెయే సకలసుఖముల కాకరమనుకొనినాఁడు. ఇట్లు కొంతకాలము జరిగెను. పిమ్మటసుఖము మరల దారిపట్టిపోయినది ఇంతదనుక సుఖమొక్క తావుననైన నిలుకడగనున్నదా? తల్లిపైటచెఱగు, నాటవస్తువులు, బొమ్మల పుస్తకములు, శాస్త్రపాఠములు, హేమపతకములు, ధనములకుఁబట్టిన గతియే భార్యకును బట్టినది. సుఖమెక్కడకుఁబరుగెత్తికొని పోయినది? సంతానముమీఁదికని చెప్పవలెనా? భారతభూమియందు బిడ్డలులేనియిల్లు పవిత్రముకాదుకద.

పుత్రునికొఱకాతఁడు పడిన పరితాపమింతింతయనఁజనదు! సర్వకాల సర్వావస్థలయందును బుత్త్రాపేక్షదక్క నింకొక చింతలేకుండెను. ఏది యిచ్ఛయించుచున్నావో యదియె నీకు లభించితీఱును. కాలక్రమమున నాతనికొక కొమరుఁడు కలిగెను. అప్పుడతనికిఁ గల్గిన యానందమునకు మేరలేకపోయెను. ఏమి, సంతోషము, వెల్లివిరియుచున్నదే. పట్టాభిషేకమహోత్సవమునకు నేనుఁగుపై బయలుదేఱు యువరాజునకు సహితమంత సంతోషముండఁజాలదుసుమీ! అతఁడు భూమిమీఁదఁ గాలు నిలుపుటలేదు. పృథ్వీపైనఁ బదిగజములపైన నాకాశమార్గమున, గాలిలో నడచుచున్నాఁడు. గాలిలో నడుచుటయేమిటి, యీదుచున్నాఁడు; కాదుకాదు పక్షివలె నెగురుచున్నాఁడు. మంచిది ఇఁక సంబరములు, పండుగలు, నుత్సవములు లెక్కలేకుండఁ జేసినాఁడు. ఇప్పటికైన నాతని వాంఛాపూర్తియైనదా? తన శైశవావస్థ మొదలుకొని యిప్పటివఱకు సుఖమునకు స్థిరవాసము కనఁబడదాయెనే. అదియొక చోటినుండి మఱియొకచోటునకు బరిభ్రమణము చేయుచునేయున్నదికద. ఇప్పటి కాఱుమాసములు దాఁటినవి. సర్వసాధారణముగ బిడ్డలు కలుగుటతో మనుష్యులు పరిపూర్ణ సుఖమనుభవించుచున్నట్లెంచఁబడుచున్నారు సుఖదేవతాప్రయాణమునకు స్వంతానప్రాప్తి గమ్యస్థానమగుచున్నది. అది మొదలు మానవుల వయోబలములు క్రమముగ దగ్గుమొగము పెట్టును. చంటిపిల్లలును బెద్దవారుకాఁగనే వారి సుఖాన్వేషణ ప్రారంభమగును. బోసినోటితో జంద్రబింబమువంటి ముఖమండలముతో, మెఱ

యు సర్వాంగ సుందరుఁడగు సుపుత్త్రుఁడు నిస్తులమగు సుఖ మునిచ్చుచున్నమాట వాస్తవము. అమ్మ! యిప్పటికి సుఖమున కవధినిగనుగొని నట్లున్నది.

ఒకింత పరిశీలించిచూతము. సుఖమనునది తల్లియొడి యందుఁగాని, బొమ్మలయందుఁగాని, పుస్తకములందుఁగాని, ధనమందుఁగాని, స్త్రీలయందుఁగాని, సంతానమందుఁగాని, యింకను బ్రపంచమందలి యేవస్తువునందుగాని, నిజముగఁ గలదేమో పరీక్షింపుము. అట్లుచేయుటకు ముందు ప్రయాణ ముచేయుచున్న సుఖమును సూర్యకాంతితో బోల్చెదము. సూర్యరశ్మికూడ నొకతావునుండి మఱియొకస్థలమునకుఁ గద లుచునేయుండును. ఒక సమయమందలి హిందూదేశముపైఁ బ్రసరించును, కొండొక సమయంబున నైరోపాదేశముమీఁద వెలుగును అక్కడను నాగక సాయంతనమగుతఱికిఁ దొంద రగా జరిగి యమెరికా తూర్పునఁ బ్రకాశించును. అటుపిమ్మట నమెరికా పశ్చిమమున వికసించును. అంత జపానుపైఁ దన కాంతిపుంజమును బఱపును. ఓహోహో యేమిది? ఒకచోటఁ గాని స్థిరముగనిలువక, దేశదేశములను జుట్టివచ్చుచున్నదే. ఇంత వేగముగఁ బరువెత్తనేల? సూర్యకాంతి గనఁబడు బ్రదే శములు దానికి జన్మస్థానములగునా? రవితేజమునకుఁ బుట్టి నిల్లు రవియై యుండవలయునుగాని, యది ప్రసరించిన వస్తు వులు, దేశములు దాని జన్మస్థానములగునెట్లు? ఈవిధముననే సుఖము నొకచోటినుండి మఱియొకచోటికిఁ బ్రయాణమొన ర్చుచుండెడి నాయా తావులన్నియు దాని జన్మహేతువులగునా?

సూర్యకాంతికి సూర్యుఁడు మూలమగు తెఱఁగున సుఖము నకు మూలమేది కానోపును? సుఖమను సూర్యుని వెదకుదము.

చూడుఁడు. ఒక యువకునకొక పుత్త్రుఁడుదయించి నాఁడు. ఆయన యొక యుద్యోగములోఁ బ్రవేశించి చాల ధనముగడించి, తానును భార్యయు దారసుతులతో సుఖంబు న్నవాఁడు. ఒకనాఁ డాయువకుఁడు తన యాఫీసునకుఁ బోయి యుద్యోగ సంబంధములగు కాగితములను బరిశీలించుచుఁ దన పనిలోఁ మునిఁగి యుండెను. ఇట్టి సమయములోఁ దనబల్ల యొద్దనున్న గంట (Telephone Bell) మ్రోగఁజొచ్చెను. అతనిగుండె దడ దడ లాడెను. పరుగున వెళ్లి యావార్త నాల కించెను. అబ్బా! యెంతహృదయభేద్యమగు వార్త వినవలసి వచ్చినదనుచుఁ బిచ్చియెత్తినవానివలెఁ దనబల్లమీఁదనున్న కాగితముల నట్లెవిడిచి తెల్లఁబాఱిన మొగముతోఁ గనుకొలఁ కులనుండి జల జల రాలు బాష్పకణములతో, నెవ్వరితోడను మాటాడక, యెట్లో కోటును బాగయు ధరించి వీధివెంట బరు గిడుచుండెను. పైయధికారియొద్ద సెలవుగైకొనుటకైనఁ దాళక పోవుట కేదియో గొప్ప ప్రమాదము సంభవించి యుండునని తోడి యుద్యోగియులు తలంచిరి. అతనిమనస్సు మనస్సులో లేదు. మాట తడఁబడుచున్నది. బంటో్రతులతోనైన సంగతి చెప్పలేదు. అల్లదే ట్రాం బండి కనఁబడినది. పరుగు పరుగున బోవుచున్నాఁడు. బండినెక్కు లోపల పోష్టుజవానొక తంతి యుత్తరమొకటి చేతికిచ్చెను. ఆయుత్తరమును దొందరగా విప్పి చూచెను. చెప్పిన నమ్ముదురో లేదో కాని ప్రపంచ

సంబంధముగ విచారింతుమేని, యాయుత్తరమందుఁగల శుభ వార్త యెట్టి దీర్ఘ చింతానిమగ్న చిత్తునిగూడఁ బరమానందభరితుని జేయునోపు. కాని యేమి చిత్రమోకాని వానికది సంతసముఁ గూర్పలేదు. ఏమి! లక్షరూపాయల లాటరిగెలిచిన తంతివార్త సంతోషము కల్గింపనోపని యాతని మనోవ్యాకుల మెట్టిదో యూహించుట యసాధ్యముగనున్నదే! టెలిఫోను వార్త నేమైయుండును? టాంగాబండి నడుచుచుండెను. అందుఁ దానెంతకాలమునుండియో దర్శింప నపేక్షించుచుండిన గొప్ప యుద్యోగి వానికెదురుగఁ గూర్చుండి యుండెను. అతఁ డీయువకుని దృష్టిపథమునఁదగులనేలేదన్న నింతకన్న నాశ్చర్యమేమున్నది? ఆయనకుఁ జేయెత్తి నమస్కారమైనఁ జేయకున్నాఁడు. మఱికొంతదూరము సాగుటకిఁ దనకుఁ జిరపరిచితయు, బహుదినములనుండి తాఁ గనన పేక్షించుచుండిన యొకయువతీమణి యాబండినెక్కి తోడనే చిఱునగవుతో నాతని బలుకరించెను. అతఁ డామెముఖమును జూచెను. కాని యామె మాటలతనికర్ణరంధ్రములఁ జొరలేదు. మనసు మాయమైన నిందియములు తమ వృత్తులందుఁ జొరవందురిందులకే కాఁబోలు!

మాయువకుని మానసము నింతగా కలవరపఱచుచుండిన విషయమేదియై యుండనోపు?

ఆయువకుఁడు సంగతి పూర్తిగఁ దెలియక మిగులఁ బరితపించుచున్నాఁడు. పాఠకులుకూడ నట్లె సంగతి దాఁచినం

దులకుఁ గొంత విసుగు చెందియుందురు. కావునఁ దెలుపుచు న్నాఁడను. ఈసరి కతఁడు తనయిల్లున్న సందులోఁ బ్రవేశించెను. విపరీతమైనధ్వని, గల్లంతు, బొబ్బలు వినవచ్చెను. పరుగుపరు గున నిల్లుచేరెను. అతఁ డేమి కాంచెననుకొనుచున్నారు? వాని యిల్లు దహనమగుచుండెను అగ్నిజ్వాల మింటికెగయు చుండెను. ఆతని యిల్లాలు, ముసలితల్లి, ముత్తవ, బంధుమిత్రు లు ఱొమ్ములు బాదుకొనుచు హాహారుస నేడ్చుచు నేలఁ జతికి లఁబడి యుండిరి. అతని మనస్సెట్లుండెనని చెప్పఁగలము? వానికిఁ గావలసినవా రందఱు నచ్చటనే యుండిరి. కాని యొ క్కఁడు మాత్రము కానరాకుండెను, ఎవనిమీఁదఁ దనసుఖ మంతయు నాధారపడియుండెనో యట్టి తన ప్రియపుత్రుఁడు కానరామి నాతఁడొక్కఁడే కనిపెట్టెను మిగిలిన వారందఱుఁ దమప్రాణములను దక్కించుకొని యావలఁబడిరిగాని యేము ద్దులమూటయగు నాబాలకుని సంగతి యోజింపరైరి. ఇఁక నాతనికి సుఖమెక్కడిది? తన సుఖస్థానమగు బిడ్డఁడులేఁడు. ఇఁకేమున్నది? అప్పుడు భార్యను బిలచి, "కుఱ్ఱవాఁడెక్కడ?" వని యడుగ నామె నిరుత్తరయై రోదనము చేయుచుండెను. అప్పుడతఁడు నిజమును గ్రహించెను. హాహాకారములు సలి పెను. "ఏమిగతి, యెవరు రక్షకు"లని యఱచుచు గుండెలు బాదుకొన మొదలుపెట్టెను ఇల్లంటుకొనుటకు ముందు బిడ్డ దాది యొద్దనుండెను. అది పాలిచ్చి, యాడించి, కొంతసేపటికిఁ దొట్టిలోఁ బరుండఁబెట్టి నిద్రపుచ్చి తనత్రోవఁ బోయెను. ఇంతలో నిప్పంతగిలి యిల్లంటుకొనెను. ఇంటిలోని వారందఱు

బిడ్డఁడు దాదియొద్ద నాడుకొను చుండె ననుకొనిరి ఇల్లుకాలుచు న్న తొందరలో నెవరికివారు దమప్రాణములు రక్షించుకొనఁ జూచిరేకాని బిడ్డసంగతి యూహింపరైరి. తండ్రి ప్రశ్నించు వఱకు బిడ్డమాటయెవ్వరికి జ్ఞప్తికిరాలేదు. ఇప్పుడందఱు తెలిసికొనిరి. కాని యేమిప్రయోజనము! అతనిభార్య, తల్లి, బంధువులు, స్నేహితులు, గగ్గోలుపెట్టియేడ్చుచుండిరి. మంట లన్ని దిక్కులను వ్యాపించినవి. మనుష్యుఁడు చొచ్చుటకు వీలులేకుండెను. అప్పుడు యువకుఁ డనుచున్నాఁడు:—"అన్నలార! బాబులార! మాబిడ్డనుగొనివచ్చి రక్షింపుఁడు. మాకుఁ బుత్త్రభిక్ష పెట్టుఁడు." పోలీసువారు నితరప్రేక్షకులు నేమిచేయుటకుఁ దోఁపక యూరక చూచుచుండిరి. "పుణ్యాత్ములార! ఏతీరుననైన మాపిల్లవాఁడు మంటలోఁబడి చావకుండ బయటకులాగుఁడు. అట్లు చేయువారికి మాకుఁగల ధనమంతయు నిచ్చివేసెదను. ఇంతియకాదు. నేఁడుమొదలుకొని పదిసంవత్సరములవఱకు నేనార్జించు ధనమంతయుఁగూడ నర్పింతునని ప్రతిజ్ఞ చేయుచున్నాఁడ" నని యతిదీనముగ నాయాజమానుఁడు వాక్రుచ్చెను. (ఆకాలమున నస్నెభయాపు ఇన్సూర్యాన్సుకంపెనీలు పుట్టలేదు.)

ఈకథపట్టునఁగల విచిత్రమును బాలకులు గమనింపవలయును. చంటిపిల్ల లందఱకుఁ బ్రేమగూర్చువారే. వారు ముద్దువచ్చెదరనుట వాస్తవముకాదని యెవ్వరనఁగలరు? బిడ్డప్రాణముకొఱకు దల్లిదండ్రులు తమకుఁగల విత్తమంతయు వెచ్చింతుమనుటయం దాశ్చర్యమేమియులేదు. బిడ్డప్రాణ

ముతోఁ బోల్చిచూడ మనకుఁగల ధనధాన్యసంపత్తి యేమి
లెక్క? ఏమి సమర్పించినను నొక్కప్రాణిని రక్షించుటతో
సమానమగునా? ఆతండ్రి తన సర్వమును త్యజింతుననెగదా!
మంచిది. రాముఁ డొక్కప్రశ్న నడుగుచున్నాఁడు. "సుఖమున
కాధారము శిశువేయా? మఱియొకటియా? చూడుఁడు. బాగుగ
యోజింపుఁడు. బిడ్డకొఱకు సర్వమును త్యజించుచున్నారుకద!
అంతకంటె ప్రియమైనదానికొఱకు బిడ్డనుగూడ వదలుకొను
చున్నా రనుసంగతి మీరు గ్రహించినారా? విత్తమును భాగ్య
మును, నాస్తిని సర్వము విడుచుటకు సిద్ధముగనున్న తల్లిదండ్రు
లితరులను మంటలలోదుమికి తమబిడ్డను రక్షింపుమనుచున్నారు.
కాని తమప్రాణములుపాయుట కొప్పుకొనుచున్నారా? ఇతరుల
ప్రాణము లంత సులభమును, దమ ప్రాణము లంతతీపియు
నా? బిడ్డను బ్రతికించుటకుఁ దామేల మంటలలో నుఱుక రాదు?
ప్రపంచమందలి సకలవస్తువులకంటెను బిడ్డయే యెక్కువయిన
పక్షమునఁ దమ ప్రాణములనుగూడ నేల తృణీకరింపలేకపో
యిరి? పొరపడకుఁడు, పాఠకమహాశయులారా! పొరపడకుఁడు.
ఇదిగో సత్యమును బలుకుచున్నాను. ఇతర వస్తువులకంటె బిడ్డ
యెక్కువ. బిడ్డకంటెఁ దమప్రాణము లెక్కువ, బిడ్డచచ్చినను
సరేకాని వారు మాత్రము మంటలోఁబడి మ్రగ్గనోపరైరి.
బిడ్డయాత్మకంటె వారి యాత్మలు వారికెక్కువ ప్రియమైనవని
దీనివల్ల తేలుచుండలేదా? ఏదిపోయినను 'నే' నుండవలెను.
'నా'యందు నాకుఁగలసుఖ మితరులయందు లేదు. వారుదుమికి
నయెడల నది నిజమయిన యాత్మత్యాగ మనిపించుకొని యుం

డును. అట్లుచేయనిత్యాగ మేమిలెక్క? కాని బిడ్డకొఱకుఁ దమకుఁగల సర్వము సమర్పితము; స్వీయ (ఆత్మ) సుఖము కొఱకు బిడ్డకూడ సమర్పితము.

సుఖముయొక్క ప్రయాణములో నంతిమావస్థ, తుదిమకామ, పుత్త్రప్రాప్తి యనుకొంటిమికాని యదియుఁ జంచలము, నసత్యము, నస్థిరమనియుఁ దెలిసెకద! పిల్లలయందుఁ గూడ నిజమైన సుఖమొసఁగఁగల స్వతంత్రశక్తి లేదనియు, నీయాత్మ ప్రకాశమును బిల్లలపైఁగప్పి నీవు నీయందే సుఖము గాంచుచున్నను, దానిని వారిపై నారోపించుచుంటివనియుఁ దేలుచున్నదికదా? నీయాత్మతేజమే బిడ్డనిముఖమును సౌందర్యవంతముగఁ జేయుచున్నది. ఈకథాపర్యవసాన మేమనఁగ:— సుఖమునకు శాశ్వతనివాసమవు నీవే. ఆత్మవలననే నిజమైనసుఖము కలుగుచున్నది.

ఇప్పుడు మనము సుఖమునకు మిక్కిలి సన్నిహితమగు స్థలమును జేరినారము. యాజ్ఞవల్క్యుఁడు భార్యయగు మైత్రేయికీవిషయ మిట్లు బోధించెను. "బిడ్డకొఱకు బిడ్డప్రియమగుట లేదు. ఆత్మ (హితము) కొఱకు బిడ్డ ప్రియుఁడగుచున్నాఁడు. భార్యకొఱకు భార్య ప్రియమగుటలేదు. భర్తకొఱకు భర్త ప్రియుఁడగుటలేదు. భార్యాభర్త లాత్మకొఱకె ప్రియులగుచున్నారు." ఇదియే సత్యము. కొందఱు మఱికొందఱిని గేవలమగుప్రేమతోఁ బ్రేమించుచున్నామని పలుకుచుందురు. కాని యదియెక్కడిమాట? ఎంతయసాధ్యము? ధనమును ధనముకొ

అనేకే యెవ్వాఁడును బ్రేమింపఁడు. దానివలనఁగలుగు నాత్మ (సుఖము) కొఱకే ధనము ప్రియమగుచున్నది. ఒకఁడు చాలకాలమునుండి తానుబ్రేమించుచుండినభార్య వానియాజ్ఞానుసారము నడువనప్పు డామెను వదలిపెట్టుచున్నాఁడు. తనకుఁ బనికిమాలినవాఁడని తోఁచినప్పుడు భార్యయు భర్తనట్లే విడనాడుచున్నది. నేరోయను రోమనుప్రభు వొక్కఁడుండెను. వానికిఁ దనరాజధానియందు దేవగింతకలిగెను. పట్టణమునకు నిప్పునంటించి చూడవలెనని యభిలాష కలిగెను. సమీపమందున్న యొకగుట్టనెక్కి, నగరమునకు నలుప్రక్కలను నిప్పుపెట్టిరమ్మని తన యనుచరమిత్రుల కాజ్ఞనొసంగెను. వారలట్లుచేసి వచ్చిరి. రాజధాని మండిపోవుచుండెను. సకలము నశియగుచుండెను. ఆమంటలనుజూచి మహానందభరితుఁడగుచు, నేరోప్రభు వాగుట్టమీఁద సుఖముగ ఫిడేలు వాయించుకొనుచుఁ గూర్చుండెను. కావున ధనమేమి, దారయేమి, పుత్త్రులేమి, సర్వము నాత్మకొఱకు వర్జింపఁబడుచున్నవి. ఆహా! యేమి యాత్మ(సుఖ) ప్రభావము! రాముఁడు స్వయముగఁ జూచిన విచిత్ర మొక్కటికలదు. వివరించెదను వినుఁడు. ఒకనాఁడు గంగానదికి గొప్పవఱదవచ్చెను. నీటి (Level) వెల్లువ యధికమగుచుండెను. ఒకకోఁతి, పిల్లలతోఁగూడ నదీతీరమందున్న యొకచెట్టుపైన వసించుచుండెను. నీరు లేచుచుండెను. ఆకోఁతి పిల్లలతోఁగూడఁ బైకొమ్మమీఁది కెక్కెను. ఇంకను నీరధికముకాఁగా పైకొమ్మమీఁదికెక్కి కూర్చుండి నీటివెల్లువను భయముతోఁ జూచుచుండెను. నీరులేచి దానిపాదములను

దాని యింకను బైకివచ్చుచుండెను. పిల్లలు గడగడ వడఁకుచుఁ
దల్లినిగట్టిగఁ గౌఁగిలించుకొని వదలకుండెను. తనప్రాణములు
దక్కించుకొను తెఱవుఁ గానకున్నతఱిఁ బిల్లలబరువు దుర్భరము
కాఁగా నొకపిల్లను మెల్లఁగఁ బ్రవాహములోఁ బడఁద్రో
సెను. నీరింకను బైకివచ్చెను. మఱియొకపిల్ల నేటిలోనికిఁ ద్రోసి
వేసెను. నీరింకను బైకివచ్చుచుండెను. మూఁడవపిల్లనుగూడఁ
గాలిక్రిందఁ బెట్టి త్రొక్కి నదిలోఁ బడవేసి తానొక్కతెయు
మిగిలి బ్రతుకుగాంచెను. ప్రపంచమంతయు నింతేసుఁడీ! మన
కుపయోగపడినంతవఱకు నన్నివస్తువులు మనకుఁబ్రియమైనవే.
కాని యేవేళ మన కవి యుపయోగపడవో యప్పుడె యవి
విసర్జింపఁబడుచున్నవి.

కాఁబట్టి సుఖమునకు మూలము నీవే. నీయందే సుఖ
ప్రదమైన వస్తువున్నది. అదియేది? అగపడదేమి? అదియెక్క
డనున్నది? మనయవయవములలో దేనియందున్నది? పాద
ములయందుఁ గలదేమొ! చూతము. పాదములను, గాళ్లను
బోఁగొట్టుకొనుట కెవ్వఁడయిన నిష్టపడునా? పాదము లెల్ల
రకుఁ బ్రియమగు వస్తువులే కదా! కాని యందఱకును జేతులు
పాదములకంటెఁ బ్రియమైనవి కావా? అవును; పాదములతోఁ
బోల్చినప్పుడు చేతులు ప్రియతరములగుచున్నవి కాని, సుఖ
ము సర్వమును హస్తములయందుమాత్రము కలదా? అది
యు సున్నయె. పోనిండు. ముక్కునందుఁగాని కనులయందుఁ
గాని కలదేమొ! అన్నియింద్రియములకంటెను నేత్రేంద్రి

యము ప్రియతమమైనదని వేఱజెప్పనక్కఱలేదు. కాని యిం
ద్రియము లన్నిఁటికంఁటెఁ బ్రాణ మెక్కువ యగునుగద. ఒకఁ
డు కన్నుపోయిన నొప్పుకొనునుగాని ప్రాణముపోవ నొప్పు
కొనునా? దీనినిబట్టి యితరేంద్రియములకన్నఁ బ్రాణ
మెక్కువ సుఖప్రదమని తేలుచున్నది.

మానవశరీర మొకసారి తిలకింపుఁడు. అం దేమూల
నైన సుఖమునకు రూఢమైన స్థానముకలదేమొ చూతము.
మనము మనదేహమును వదలుట నిశ్చయము. అదియేల!
ప్రతిముహూర్తమును మనశరీరము మాఱిపోవుచున్నది. ఏడు
సంవత్సరములగుతటికి మనదేహమందలి ప్రతియణువును గ్రొ
త్తదిగ మాఱుచున్నది. మఱియు దేహము నశ్వరమగుచు
న్నది. అట్టిది నిత్యసుఖ మొసఁగజాలునెట్లు? పోనిండు, మనసు
నందుఁగాని, బుద్ధియందుఁగాని మేధయందుఁగాని కలదేమొ పరి
కింతము. అవియు, నల్పసుఖ మొసంగఁగలవిమాత్రమై
యున్నవి. అత్యంతమైన సూక్ష్మబుద్ధికంటె నెక్కువసుఖ మొ
సఁగఁగలది, ప్రియతరమైనదొకటి కలదన్న నది ప్రాణమే
నఁజనును. బుద్ధిజాడ్యముకలిగినను బిచ్చివానివలెనైన జీవిం
యుండినఁ జాలునని మానవులు తలంచుచుందురట యెఱు
మా? 'బ్రతికియుండిన బలుసాకుఁ దినఁగవచ్చు' నను సామె
లోకప్రసిద్ధముకద!

'మతి స్తిమితము లేనివాఁడవై యున్మత్తుఁడవై జీవింపఁ గోరుదువా? లేక మృత్యువును స్వీకరించెదవా?' యని యడుగుదువేని ప్రతిమనుజుఁడు నేదికోరునో వేఱ స్పష్టముగఁ జెప్పనేల? చూచితిరా! ప్రాణముకొఱకు జ్ఞానము, తెలివితేటలను గూడ వదలుకొనుచున్నాము! మంచిది. ప్రాణము, వ్యక్తిగత ప్రాణము, 'నాప్రాణ' మనుకొనుదానియందైన నిజమైన సుఖము కలదేమొ చూతము. వేదాంత మేమనుచున్నది? ఇది యుఁగల్లయే. ప్రాణమందుఁగూడ సుఖము లేదు. సుఖమునకు స్వస్థాన మాస్వారాజ్యము వ్యక్తిగతజీవితమున కావల నున్నది. దానిని గనుఁగొనుఁడు. అది యెక్కడనున్నదో వెదకుదము.

ప్రాణావసానసమయమందున్న యొక యువకుని రాముఁడు చూచుట సంభవించినది. అతఁడు భయంకరమైన వ్యాధితో బాధపడుచుండెను. దేహమందంతటను మంటలు పోట్లు ప్రారంభించినవి. ఆబాధపాదములలోఁ బ్రారంభమైనది. మొదట బాధ కొద్దిగనుండి క్రమక్రమముగఁ బైకి బ్రాఁకుచు నధికమగుచుండెను. మోకాళ్లదగ్గరకు వచ్చునప్పటికి వాఁడు తాళలేక కొట్టుకొనుచుండెను. కడుపువద్దకు వ్యాపించుతఱికి దుర్భరమైననొప్పిచే నాతఁడు మెలికెలుతిరిగిపోవుచుండెను. ఆనొప్పి గుండెలలోనికిఁ బ్రాకఁగనే, యా యువకుఁడు మరణించెను.

అతఁడు చనిపోవుచు వచించినమాటలు మీకుఁ దెలియునా? "అబ్బా! నాప్రాణము లెప్పుడుపోవును? నేనెప్పుడు సుఖముగందు" ననుచు జీవములు విడచెను. అన్నము

లేక, కడుపుమంట పట్టలేక కొన్ని వ్యాధులవలనిబాధ సహింప లేక ప్రాణముపోయిన బాగుండునని తలంచువారి నెందఱిని మనము కాంచుచుండుటలేదు? చూడుఁడు! మీ (పశ్చిమ) దేశములో నెవఁడైన మరణించినప్పుడు "వాఁ (Ghost) డా త్మను వదలివేసినాఁ"డందురు. మాహిందూదేశములో "వాఁడు దేహమును వదలిపెట్టినాఁ"డందురు. ఇదియె ప్రాగ్దేశమునకుఁ బ్రతీచీదేశమునకును గల తారతమ్యము. పశ్చిమములో దేహమే శాశ్వతమైనదనియు నాత్మ (Ghost) నంటియున్నదాని యన్యపదార్థమనియు నూహించుచున్నారు. భారతవర్షములో నాత్మయే శాశ్వతమైనదనియు, దేహ మన్యపదార్థమనియుఁ దలంతురు. ఆత్మయే నిత్యము సత్యమునైన వస్తువుగా నెన్న బడుచున్నది. భారతదేశములో నెవఁడైనఁ జచ్చిపోవుచున్న ప్పుడు తన కన్యపదార్థమగు దేహమును బరిత్యజించుచున్నానని తలంచునుగాని "నేను నశించువాఁడ" నని తలంపఁడు. శరీరము మాఱుచుండుననియు 'నే నమృతుఁడను, నాకు మృతిలేదు, నేను శాశ్వతుఁడ'నని ప్రతిభారతీయుఁడును విశ్వసించును. అందువల్లనే యా యువకుఁడు "నా ప్రాణ మెప్పుడు పోవు" నని పల్కుచు దేహము వీడెను.

దీని భావమేమి? ప్రాణముకంటె నతిశయమైనదొకటి యున్నదనికాదా? 'నా' ప్రాణమని చెప్పుచున్న తాను దన ప్రాణముకంటె భిన్నుఁడు నధికుఁడుకాఁడా? ప్రాణ మెవని సొమ్ముగానున్నదో, యట్టివాఁడు ప్రాణముకంటె నధికప్రియుఁ డుకాఁడా? వ్యక్తిగతప్రాణములకంటె విలక్షణమైన 'నా'

త్వమత్యంత సుఖప్రదమును, బ్రియతమము ననుట కేమైన సందేహమున్నదా? మనుష్యులు ప్రాణములనుగూడఁ బరిత్యజించుట కెప్పు డభిలషించుచున్నారు? తమయాత్మలకు నైసర్గికము నుత్కృష్టమునైన సుఖము నొసంగఁజాలనప్పుడు ప్రాణములను గోలుపోవ నిశ్చయించుచున్నారు. దేని (సుఖము) కొఱకు బ్రాణము జీవితము సమర్పింపఁబడుచున్నదో యట్టియాత్మయే సుఖమునకు మూలము, నిలయము, నిత్యనివాసముకాదా? ఆ యాత్మయే యందఱకు సుఖస్థానము. ఆనందమున కదియే జన్మ స్థానము.

ఇఁకఁ జూడుడు! పాదములకంటెఁ జేతులు, వానికంటెఁ గన్నులు, వానికన్న బుద్ధి, దానినిమించితే ప్రాణము లొకదానిని మించి మఱియొకటి వరుసగ నేల ప్రేమాస్పదము లగుచున్నవి? వేఱుగఁ జెప్పనేల? వానిలో నొకదానికంటె నింకొకటి నిత్యాత్మకు సన్నిహితములు సమీపములు నగుటచేత బ్రీతిమానవుఁడు నితరుల బిడ్డలకంటెఁ దనబిడ్డయే యెక్కువ సౌందర్యవంతుఁడని తలంచుటలేదా? పొరుగింటి చక్కని పిల్లవానికంటె మీకురూపులగు పిల్లలనుగూడ మీరెక్కువగా బ్రేమించుట లేదా ?

అది యెందువలన? వేదాంతమిచ్చు సమాధానము వినుఁడు. నీపిల్ల యనుకొనుచుండినదానిని నీవు "నా" (మమ)యను పసిఁడిపూఁతపూసి మెఱుఁగుపెట్టినావు. కాళిదాసుని శకుంతల కంటె, ప్లేటో వ్రాసిన తత్త్వశాస్త్రముకంటె నీవేపుస్తకములోఁ గాని, వార్తాపత్రికలోఁగాని వ్రాసిన రెండుముక్కలు పద్యములు ని

కెక్కువ యానందమును సుఖమును గూర్చును. అది యెందువల్ల నో తెలియునా? "మమ"యను నీయాత్మ సూర్యరశ్మి వానిపైఁ బ్రసరించుటఁజేసి సుమీ! నీయాత్మగతరవి తేజము వేనిపైఁ బ్రకాశించునో యవియన్నియు నీకు సుఖమును గూర్చుచున్నవి ఆనంద మొసంగుచున్నవి. ఈనిజము గ్రహించినవారగుటచేతనే హిందువులు సుఖమనువస్తు వంతరంగమందే కలదని యందురు. నీహృదయమే యానందమునకు నిత్యనివాససీమ సుఁడీ! ఆయానందస్వర్గము మీయంతర్గతమైయున్నది. ఇట్టి స్థితి సత్యమగుచుండ మానవులు సుఖముకొఱకు బాహ్యపదార్థములను వెదకుచుండుట వెఱ్ఱికాదా!

భరతవర్షములో జరిగిన యీకథ వినుఁడు. ఒకపురుషుఁడొకయువతిని బ్రేమించియుండెను. అతఁ డామెకై పరితపించుచుండెను. వానిశరీరము నానాటికి కృశించుచుండెను. రక్తమాంసములు క్షీణించిపోయెను. ఆదేశపుఁబ్రభువున కాసంగతి తెలిసి యావింతఁ జూడఁగోరి యాపురుషుని తనకొలువునకుఁ బిలిపించెను. అతఁడు ప్రేమించుచుండిన జవ్వనినిగూడఁ గొలువుకూటమునకు రప్పించెను. ఆమె రూపవతికాదు. మాలకాకిఛాయ, వికృతాకారమునుగల యానారీమణి యాతని కెట్లు నచ్చెనని రాజాశ్చర్యపడుచుండెను. ఆభూపాలుఁడంత దనకొలువునందుఁగల దివ్యసుందరుల గొందఱ నక్కడకుఁ బిలిపించి వారిలో వానికిష్టమువచ్చిన దానిని గోరుకొనుమని యాపురుషుని హెచ్చరించెను. అతఁడనుచున్నాడు: "హుజూర్! మహారాజా! మీకేమి! పిచ్చిపట్టినదా యేమి? ప్రేమ మనుష్యుని నంధునిగాఁ జేయు

నని మీ రెఱుఁగరా? నా ప్రేయసి యందము: మీ కెట్లు కనఁబడు
ను? నా కనులతోఁ జూచినగదా యామె సౌందర్యము మీ కగ
పడుట! నా కనులతోఁ జూచి యటుపిమ్మట భాషింపుఁడు.”
ప్రపంచమంతటను గల రహస్య మిదియే. మీకు సుందరముగ
దోఁచు వస్తువులన్నియు ‘నావి’ యను మమత్వభావనవలన నంద
ముగఁ గన్పట్టుచున్నవి గాని వేఱుగాదు. మీ చూపుల చేతనే
వస్తువులు మీకుఁ బ్రియమైనవిగాని హేయమైనవిగాని
యగుచున్నవి. స్వకీయ తేజస్సును వస్తువులపైఁ బఱపి, మీ
యొద్దనుండి యెరువుతీసికొనిన కాంతితో నవి ప్రకాశించు
చుండ, వానిని జూచి భ్రాంతులరై ప్రేమించుచున్నారు. పర
మేశ్వరుఁడు మోహినీరూపమును గని ప్రేమించుట యట్టిదే.
గ్రీకు దేశపుఁ బురాతనేతిహాసములలో ‘ఎకో’ యనునామె
తనరూపమును జూచి విభ్రాంతమై ప్రణయమోహమునకుఁ
బాల్పడెను. మనము మోహించు, ప్రేమించు సకలవిషయ
ముల యొక్కయు రహస్యమిదియే. నీయాత్మయే సమస్త
పదార్థజాలమునందును బ్రతిబింబించుచున్నది. ఆ యానంద
వారిధి నీయందే యున్నది. ఆ స్వర్గసుఖము నీలోపలనే యున్న
ది. ‘నీ’కు వెలుపలనున్న సకలమును నీఛాయలు. ప్రతిబింబ
ములు. ఇంతియ. ఇదియే సత్యము. సత్యములలో కెల్ల సత్య
మింతియకాని వేఱుసత్యము లేదు. అయినను మానవు లసలు
వస్తువును వదలి ఛాయను వెంటాడెదరు ఆహా! యేమి వైపరీ
త్యము!!

రాముఁడు స్వయముగ నెఱిఁగిన యొక చిత్రమును జె

పట్టుచున్నాఁడు వినుఁడు. ఒకపిల్లవాఁడు తప్పటడుగులు వేయుచు
నొకనాఁడకస్మాత్తుగ నడువనేర్చెను. వానియెదుటతననీడ కనఁబ
డెను. దానిగని యది యొకనూతనవస్తువుగఁ దలంచి, యాశ్చర్య
మును సంతోషమునుగలుగ నానీడతలఁ బట్టుకొనయత్నించెను.
ఆప్రయత్నములో వాఁడు నేల జతికిలఁబడెను. తలనందుకొనుట
కు ప్రాఁకసాగెను. ఆపిల్లవాఁడు ముందునకుఁ ప్రాకినకొలఁది నీడ
యుముందునకు జరుగుచుండెను. బాలుఁడు విసిగి యేడ్చుచు గ్రిం
దబడెను. నీడ వానినంటి క్రిందకే యుండెను. వాఁడు లేవగనే
యదియు లేచుచుండెను. దానిశిర ముంటికొనుటకు వాఁడు శ్రమ
పడుచుండెను. ఇంతలో వానియవస్థను జూచి తల్లి వచ్చి "యిది
గో! నీడ ముఖమును బట్టించుచున్నాను. చూడు"మనుచు వాని
హస్తము నతనిశిరముపైకిఁ జేర్చెను. బాలకుఁడు నీడతలను
బట్టుకొన్నందులకుఁ బరమానందభరితుండాయెను. ఈపిల్ల
వానివృత్తాంత మేమి బోధించుచున్నదో చూడుఁడు. బాహ్య
వస్తువులను బట్టుకొనుట వల్లగాదు. నీతలను బట్టుకొనుట
వల్లనె సుఖముకలుగుచున్నది. స్వర్గనరకములు మీహృద
యములందే యున్నవి. సమస్తశక్తికిని సుఖమునకును బ్రాణ
మునకు నుత్పత్తిస్థానము మీలోపలనే యున్నది. అశేషజీవకో
టికి మానవులకుఁ బ్రకృతికి నేదేవుఁడు కలఁడో యాదేవుఁడు
మీలో నున్నాఁడు. ఇదియే సత్యము. ఇదియే పరమార్థము.
ఓహో! జనులార! వినుండు. ఈపరమతత్త్వమును బట్టణము
లలోఁ బల్లెలలో నుచ్చైస్స్వరముతోఁ బ్రకటింపుడు. ఈసత్యము
మేఘగర్జనముతో దశదిశలఁ జాటుఁడు. ఎన్నిపర్యాయములు

త్రిప్పి చెప్పిన నింతకంటె వేఱుసత్యము లేదు.

కాబట్టి యేదైన నొక యర్థమును సాధింప వలెనని నీడను వెంటాడకుఁడు. మీతిలనే దాఁకికొనుఁడు. మీహృదయముల లోనికి బ్రవేశించిచూచికొనుఁడు. ఓహో! అప్పుడు మీకేవి కనబడుచున్నవి? రాత్రులందు మిల్కు మిలుకుమను నక్షత్రములు, శాంతిమయకాంతులఁ బ్రసరింపఁజేయు చంద్రుఁడు, దినములం దెడతెఱపిలేక యాకసమంతటను బరిభ్రమణము సేయుసూర్యుఁడు, మఱియుఁ బ్రపంచమందందము, సౌందర్యము పరిమళముగల సకలపదార్థములు మీప్రతిబింబములని కనఁబడును. బుద్బుదప్రాయములై ముహూర్తకాలంబున నాశమందు నీవస్తువులకొఱకు మానవులు తమయావజ్జీవము వ్యయ ప్రయాసములఁబడుట యెంత వెఱ్ఱితనము! హా! హా! ఏమివింత!

హిందూదేశములో నొకస్త్రీసిగూర్చిన విచిత్రకథయొకటికలదు. ఆమె యొకనాఁడింటిలో సూదిని బారవేసికొనెను. ఆమె నిఱుపేదరాలగుటచే నింటదీపము పెట్టుకొన జాలకుండెను. అంత నామె వీధిలోనికి వచ్చి వెదకులాడ దొడఁగెను. వీధులలో నేమి వెదకుచుంటివని యొకఁడడుగ, 'సూదికొఱకు వెదకు న్నా' నని యామె బదులుచెప్పెను. ఎక్కడ బారవేసికొ మ్మా' యన "నింటిలో బారవేసికొంటి" నని యుత్త ను. 'ఇంటిలో బారవేసికొనిన వస్తువు వీధిలో నెట్లుదొరకును? ఇంటిలోపల జూచుకొను' మన నా ము పెట్టుకొనశక్తి లేదు. వీధిలాంతరు వెలుతురున బయట వెదకుచున్నా' నని బదులు చెప్పెను.

పని చేయవలసియుండెను. ఆపని నామె యింటఁజేయుటకు మాఱుగ బయటఁ జేయుచుండెను.

ప్రపంచమందు జనులుకూడ నట్లే చేయుచున్నారు. స్వర్గము మీలోనున్నది. దివ్యానందము మీహృదయసీమల యందున్నది. అది యెఱుఁగక బాహ్యపదార్థములయందు గల దని భ్రమపడి యింద్రియవిషయములయం దది చిక్కునను భ్రాంతితో దాచి వెలుపల వెదకుచున్నారా! ...తపార పాట్లొ నర్చుచున్నారు! ఇంతకంటె నాశ్చర్యమేమున్నది!

భరతఖండమునందు జరిగిన యొకవిచిత్రకథను జెప్పి విరమించుచున్నాఁడను:

ఒకపట్టణములో నొక పిచ్చివాఁడుండెను. వాఁడు వీధు లందు సంచరించుచుఁ గనఁబడిన బాలురందఱితో నేటిసాయం తనము రాజమందిరమున బిల్లలకు గొప్పవిందు జరుగును గావు మీరందఱుఁ దప్పకపోవలయునని నమ్మకముపుట్టఁ బలికెను. పిల్లలకుఁ బప్పుబెల్లములనఁ జాలసంతోషము కద. పట్ట మంతటను నీవార్త వ్యాపించుటచేఁ గొన్నివందలమంది బాల మాయంకాలమునకు రాజుగారి మేడవద్దకుఁ జేరిరి. అక్క నకు నల ప్రయత్నములేమియు లేకుండుటగని బాలురు హఠా మాన్క నవ్వులు, కేకలు, నాటలు, పాటలు మొదలగు ను... గాలము పుచ్చుచుఁ బిచ్చివాని... గోపముతో నిం జను... మొగము పెట్టుచుండు నంతలో నాయున్మత్తుఁడును బల్లెలలో ...ష్టమయ్యెను.
గర్జనముతో ... పగిలే! పండత్! అబద్ధపుఁగబురు చెప్పినది

లక నీవుకూడ నిచ్చటి కేలవచ్చితి' వనివారలు ప్రశ్నింప "నేమో! నాకథ నిజముగఁ బరిణమించు నేమొ యనియు, వివారం దలుం జేరినపిమ్మట విందుజరుగుట సంభవించు నేమొ, యట్లయిన నది నేను ననుభవింపవచ్చుననియుఁదలంచి నేనుగూడ హాజరైతి"నని యాతఁడు బదులుచెప్పెను. తానుదలఁచినది జరుగునను భ్రాంతియే పిల్లలతోఁబాటు వానినిగూడ నక్కడకు రప్పించినది.

ఆతీరుననే ప్రతిమానవుఁడును దానే విషయములందు సుఖమును నారోపించి, వానిపై ననురాగమును బ్రేమను బొం దుచున్నాఁడు. తన యాశీర్వాదముచేతనే పుష్పములకందము వచ్చుచున్నది. ప్రతిమానవుఁడును వస్తువులందలి సుఖస్వభావమును దానె యారోపించి, యది నిజమని నమ్మి తాను వాని వెంట బరుగిడుచున్నాఁడు. మనకథలోని యున్మత్తునకు నితరమానవులకు నీవిషయమునందుఁ దారతమ్యమెంతమాత్రమును లేదు. నిజహృదయములలోనున్న స్వర్గమును దిలకింపుఁడు. వెంటనే మీసకలవాంఛితములు నెఱవేఱును. సకలదుఃఖములు నివృత్తియగును.

దివ్యసుఖము మీహృదయాంతరములనున్నది. బాహ్య విషయములలో లేదు. ఆంతరంగికమైన యా నిత్యసుఖము ననుభవింపుఁడు.

ఓం, ఓం, ఓం.

---

# Expansion of Self.

## ఆత్మవికాసము

మనమిప్పు 'డాత్మవికాస'మను విషయమును గూర్చి కొంచెంత యాలోచింతము. అనఁగా "మనుష్యులెన్నితరగతులుగనున్నారు? లేదా, పరమార్థవిషయకమైన జ్ఞానము మానవులలో నెన్నిరీతులుగ వికసించియున్న"దను విషయమాలోచించెదము. మఱియు నీవిషయమునే "స్వార్థము" లేక "యహంకారము" యొక్క విచిత్రపరిణామమని పేర్కొనినచో మిక్కిలియొప్పిదముగ నుండును. ఈవిషయమునుగూర్చి చివరకుఁ దేలు సిద్ధాంత మాశ్చర్యకరముగ నుండును. చూడుఁడు! ఈప్రక్కనువ్రాసిన పటములో మీకేమి కనఁబడుచున్నవి?




ఒకసాపుగీత, కొన్ని సున్నలున్నవి. ఆత్మవికాసమునకు నీసున్నలకును సంబంధమేమని యనుకొనకుఁడు. మఱియు, నీసున్నలు పూర్తిగ గుండ్రముగ లేవని సందేహింపకుఁడు. ఆసున్నలోఁ గొన్ని యండాకారముగను నున్నమాట వాస్తవము. అవి యట్లుండవలెననియే వ్రాసితిమి. వానితోఁ జాల మీకున్నది. మనుష్యులలో నెన్నితరగతులవారున్నారో చేయుటకీసున్నలెంతయు నుపయోగపడును. కాఁబట్టి సున్నలనుగూర్చి కొంతవినిపించెదము. నావలలోఁ బల్లెలలో మూలకింపుఁడు.

"సమ"యను గీతను రేఖాగణితములో సరళరేఖయం దురు. సున్నలను వలయములందురు. ఈసున్నలన్నియు వాగీతను దాకుచుండుటచే దానిని వలయస్పర్శరేఖ యందురు. ఇంక నీక్రింది విషయములను గమనింపుడు. "సమ"యను వలయస్పర్శరేఖ (Tangent) మీఁదనున్న 'హ'యను చుక్క (point) దగ్గఱ సున్నలన్నియు నాగీతను స్పృశించుచున్నవి కద. అన్నిటికంటెఁ జిన్నసున్నను దిలకింపుఁడు. దాని నంతె కంటెఁ జిన్నదిగ వ్రాయవలసినదే కాని యింకను జిన్నదైనచో ష్టిమున మీఁదుఁగనఁబడదని యామాత్రపుదానినిగ వ్రాసితిమి.

ఈచిన్నసున్నకంటె రెండవసున్న కొంచెము పెద్దది. దానికంటె మూఁడవసున్న పెద్దది. దానికంటె బెద్దది నాల్గవ సున్న. ఇట్లొకదానికంటెనింకొకటి పెద్దదిగనున్న యీసున్నలం విచిత్రముగనుండు. సున్న పెద్దదగుచున్నకొలఁది, దాని (Centre) మధ్యము 'హ' యనుచుక్క నుండి దూరమగుచున్నది కదా! మధ్యము దూరమగుచున్నదనగ ఆకు (Radius- శేక బండిచక్రపుమధ్యమునుండి కైవారమువఱకు వ్యాపించు గీతవంటి రేఖ) పెద్దదగుచున్నదని యర్థము.

ఆకు పెద్దదగుట, వలయామధ్యము 'హ' నుండి వి చుట, గిరిపెద్దదగుట, కైవారము బాహుళ్యమగుట యను నొక్కమాఱుగ సిద్ధించుచున్నవి. కైవారము కోపిల్ల మెండు తగ్గిపోవుట. గిరి చిన్నదగుట, ఆకు కుఱుచయగుట వదార్థమాల మధ్యమునకును 'హ' యను చుక్కకును దూరమ

మనకు దృష్టిగోచరములు కాకపోవుటవల్లనే మనము చూచినంతవఱకు భూమి చదునుగనే కనబడుచున్నది. కాని గుండ్రముగఁ గనఁబడుటలేదు.

ఈ పైవిషయములను బాగుగ జ్ఞప్తియందుంచుకొనుటచేసి యీక్రిందఁ జెప్పఁబోవు విషయములు సులభముగ బోధపడును.

జీవమనఁగనేమి? జీవముయొక్క ప్రధానలక్షణములేవి? జీవపదార్థము జడపదార్థమునుండి యేచిహ్నములచేత విలక్షణమగుచున్నదని విచారింతుము. సర్వసాధారణముగ జీవకోటి లేక ప్రాణికోటియందుఁ జలనము, వృద్ధి, సామర్థ్యము, చురుకుదనమును గనఁబడుచున్నవి. నిర్జీవపదార్థములకు లేక జడపదార్థములకుఁ బైనఁజెప్పిన గుణములు కనఁబడుటలేదు. జీవించియున్న మనుష్యుఁడు నడచును, మాట్లాడును, నిద్రించును, తిరిగి లేచి యిటునటు సంచరించును. నిర్జీవమైన శవ మట్టి కార్యములేవియుఁ జేయఁజాలదు. జీవజంతువులవలెఁ బ్రాణములేని జంతువులు నడువలేవు. పరుగెత్తలేవు. ఆహారముఁ గైకొనలేవు. పాపమవి కదలలేక యున్నచోటనేయుండి కుళ్ళిపోవలసినదే

ప్రాణశక్తియున్న చెట్టు పెరుఁగుచుఁ గొమ్మలు, నాకులు, బూవులు వేయుచు శోభిల్లుచుండును. చచ్చినవృక్ష మెండు మోడువలె నట్లేయుండును. మన మిప్పుడు జీవజడపదార్థముల సామాన్యలక్షణములఁ దెలిసికొంటిమి.

చూడుడు! సృష్టియందలి జీవరాసులన్నియు నాలుగు పెద్ద విభాగములుగ నేర్పడియున్నవి. అందు మొదటిది లోహవర్గము, రెండవది వృక్షవర్గము. మూడవది జంతువర్గము. నాల్గవది మానవవర్గము. ఈ యీశ్వరసృష్టికంతకును మానవుఁడే రాజు లేక యధికారిగ నెన్నఁబడుచున్నాఁడు. ఏలయన మహాసూక్ష్మబుద్ధిగల జంతువులు చేయుపనులన్నియుఁ జేయుటయే కాక, వానినతిశయించిన పనులనేకములొనర్చుచు, వాని నన్నిటిని వశపఱచుకొనఁగలుగుచున్నాఁడు. కొన్ని జంతువులు మహావేగముతోఁ బరుగెత్తఁగలవు. ఎట్టి యున్నతపర్వతశిఖరములైన నెక్కఁగలవు. మానవుడంతకంటె వేగముగఁ బ్రయాణముచేయుటకు నెత్తైనస్థలములకుఁ బోవుటకు వలయు యంత్రములను గనిపెట్టినాఁడు.

మానవుఁడు దూరదర్శనయంత్రమును గనిపెట్టి నక్షత్రమండలములలోని రహస్యములను గ్రహింపఁగలుగుచున్నాఁడు. ఆవిరి విద్యుచ్ఛక్తులను వశపఱచుకొని దేశకాలములనవలీలగఁ దృణీకరించుచున్నాఁడు. వాయువేగ మనోవేగముల ధిక్కరించి భూభాగమున నెల్లయెడలఁ దంతివార్తలంపుచున్నాఁడు. నిర్భయముగ నిరాటంకముగ నంతరిక్షమార్గమున స్వేచ్ఛావిహారము సల్పుచున్నాఁడు. వారాశిమీఁదను, క్రిందను రాచబాటలలోవలె నోడల నడుపుచున్నాఁడు. జంతువర్గమీపనులలో నొక్కటైనఁ జేయఁగలదా? ఇందే మానవజన్మముయొక్క విశిష్టత, యాధిక్యము స్పష్టపడు

చున్నవి. కాదా? కాబట్టి తక్కిన జంతువులమంతయు, మనుష్యునికంటెఁ దక్కువయని తేలుచున్నది.

ఇప్పుడు వృక్షవర్గము నొకింత పరిశీలింతము. వృక్షము లెదుగుచున్నవి. వానికి వృద్ధి సంచలన మున్నది. కాని వాని చలన మేకదిక్కునకేయె యున్నది. అవి యొకచోటనుండి యింకొకచోటికిఁ బోలేవు. ఎక్కడఁ బుట్టుచున్నవో యచ్చటనే పెరుఁగుచున్నవి. కొన్ని మహావృక్షములు నలుదెసలను శాఖోపశాఖలు వేయును. ఊడలు వేయును. వానివేళ్లు చాలలోఁతుగఁ బాదుకొనును. అది యంతయు నిజమే; కాని వృక్షజాతి ప్రదర్శించు శక్తిసామర్థ్యములు, జంతువులు ప్రదర్శించువానికంటెఁ జాల తక్కువయని యొప్పుకొనక తప్పదు. కాఁబట్టి జీవరాసులలో జంతువర్గమునకంటె వృక్షజాతి హీనమైనదని స్పష్టమగుచున్నది.

లోహవర్గము నొకింత పరికింతము. జంతుశాస్త్రజ్ఞుల నిర్వచనముప్రకారము లోహజాతికి జీవములేదు. కాని ప్రాణికోటియొక్క సామాన్యవిభాగములను జేయుచున్న వృద్ధి లోహములుకూడ గొంతమార్పును, బరివర్తనమును బొందుచున్నట్లు మనము కనిపెట్టుచుండుటచే వానిని నిర్జీవపదార్థములుగ నెంచఁదగదు.

అనేకాంతరములు మెట్లుగనున్న యీసృష్టిలో మనము పరిగణింపఁదగినంత జీవస్ఫురణఁ దోఁపఁజేయుచున్నంతమాత్రమున వాని నధమాధమములని పూర్తిగ నిరాకరింపఁదగదు.

అట్లయినను నన్నను, లోహవర్గము నేమాత్రమో జీవచలనముఁ గలిగియున్నదే కాని యాచలనము బాహ్యమున కగపడుటలేదు. అయిన నవి సూక్ష్మాంశములుగల జీవులేసుమీ!

కావున చలనసామర్థ్యములనుబట్టి జీవరాసులయంతరములేర్పడినవని మనకు స్థిరపడుచున్నది. ఇక సృష్టిరచనాకౌశలము నొక్కమారు గనుగొందము. ఏమి యీసృష్టి? ఏమి యీప్రపంచము? ఈప్రకృతి యెంతచిత్రవిచిత్రముగఁ గనబడుచున్నది? ఏవంకదిలకించినను భిన్ననామములు, భిన్నరూపములు, వివిధవర్ణములు, ఎటుచూచినను పార్థక్యము, భేదము. ఇంత భిన్నముగఁదోచు నీవిశ్వమును దీర్ఘముగ పరికించితిమా, యందొకక్రొత్త యేమియు గాన్పింపదు. నిన్న కాన్పించినవస్తువే నేడు, నేఁడు కనబడినదే రేపుకనబడుచున్నది. కావున ప్రతిముహూర్తమునను మార్పుఁజెందుచున్నట్లగపడు ప్రకృతియందనుస్యూతమగు సామ్యము, సామరస్యము కలదని స్ఫురించుచున్నది. మఱియుఁ బ్రకృతియంతయు మనము వ్రేళ్ళమీఁద లెక్కింపఁగలకొలఁది ధర్మసూత్రములపై నాధారపడియున్నదనికూడఁ దెలిసికొనఁగలము. ఒకానొక కాముకుఁడు తన ప్రియురాలికొరకుఁ జెందువిరహతాప మేధర్మసూత్రముచే బద్ధమగుచున్నదో, యాధర్మసూత్రమే సూర్యచంద్ర నక్షత్రాదుల నిశ్చితచారమును బద్ధముచేయుచున్నది. ఈ పృథ్వియందలి ప్రతియణువునకును, ప్రతిరేణువునకు నన్యోన్యసంయోగము సంభవింపజేయుచున్న శక్తి యేదికలదో, యాశక్తియే గగనమండలమునఁగల గ్రహగ్రహమునకు, నక్షత్ర

నక్షత్రములకు నన్యోన్యసంఘర్షణ లేని యాకర్షణము సిద్ధిం
పజేయుచున్నది. దీనిని గనువారికిఁ బ్రకృతియంతయు బండి
చక్రపుగతివలె మండలాకృతిగఁ బరిభ్రమణము సేయుచు
న్నదేకాని యెందొకప్పుడుగాని యొకనూతనవస్తు వగుపడు
టలేదని తోఁచుట నిక్కువము.

సృష్టినంతను నొక మరమేకుతోగాని, యొకయుల్లి
పాయతోఁగాని పోల్పవచ్చును. మరమేకుయొక్క మొదటి
మెలికె యెట్లుండునో, యన్నిమెలికలు నట్లేయుండునుకద!
ఉల్లిపాయయొక్క పైపొరదీసితిమా, దానిక్రింద నట్టిపొర ఇం
కొకటి కాన్పించును. అదియు నొలిచితిమేని, దానియడుగున
నట్టిపొరయే మఱియొకటి యుండును. ఇట్లొలచినకొలదిఁ
జివరవఱకుఁ బొరలే కాన్పించుచుఁ బొరలన్నియు విడిపోగా
నుల్లిపాయ తుదకు బొరలపెట్టెయని తోఁచును.

మనము కనుచున్న సృష్టికూడ నట్టివిచిత్రమయమగు
పొరలపెట్టెయేసుఁడీ! చూడుఁడు! ఒక సంవత్సరములోపల
వచ్చుఋతువుల మాసముల లక్షణములన్నియు నిరువది
నాలుగుగంటల పరిమాణమాత్రముకల యొక్కదినములోఁ
బ్రదర్శింపఁబడుచున్నవి. ప్రాతఃకాలమును వసంతర్తువుతోను,
మధ్యాహ్నకాలమును గ్రీష్మర్తువుతోను, అపరాహ్ణసాయం
కాలములను శరదృతువుతోను, రాత్రికాలమును హేమంతశిశిర
ర్తువులతోను బోల్పవచ్చును. ఒక సంవత్సరకాల మీరీతిగఁ
గొద్ది మానములో నిరువదినాలుగుగంటలలో నెటులఁ జూపట్టు
చున్నదో, యట్లె మానవుడు మాతృగర్భాంతస్థపిండముగ

మున్నప్పుడే మనుష్యరూపమునకుఁ బోలిటి జీవరూపములన్ని యుఁ దాల్చుచుఁ గడువేగముగఁ బరిణామమంది తదనంతరము మనుష్యశిశువుగ భూమిపై నవతరించుచున్నాఁడు. మనుష్య శిశువు మాతృగర్భమున మత్స్యాకృతి, శునకరూపము, కోఁతియాకారములను దాల్చుచునే యున్నది. కావునఁ బ్రపంచమంతను బరిపాలించుచున్న సూత్రముల ననుసరించి యే మానవుఁడు తొలుత లోహ, వృక్ష, జంతువర్గముల యాకృతులను స్వీకరించినతరువాతనే మనుష్యశరీరమును దాల్చుచున్నాఁడని గ్రహింపవలయును.

ఇంతియు కాదు. మనుష్యులలో శుద్ధ సబ్బులవలె నున్న వారిని మనము కాంచుటలేదా? అట్టివారిని లోహజాతిమనుష్యులనుట కేమైన సందేహమున్నదా? అటువలెనే, న్యూనాధిక చలనములను గలిగి బయటకు మనుష్యులవలె నగపడుచున్నను వృక్షవర్గ, జంతువర్గములతోఁ దుల్యములగు జీవితములను గడపుచున్నవారు నున్నారుకదా!

ఇప్పుడు మానవశరీరములతోనున్నవారిలో నిజమైన మనుష్యులని యెన్నఁదగినవారును దేవతలని యెన్నదగినవారును గూడఁ గలరేమో యొకింత పరిశీలించెదముగాక.

ముమ్మొదట, లోహజాతిమనుష్యులసంగతి విచారింతము. లోహజాతియొక్కయు బాషాణాదులయొక్కయు వృద్ధిక్షయములు మనకు విశేషముగ గోచరింపకపోయినను, నవియుఁ గొన్నిమార్పులఁ జెందుచుండుటను గాంచుచునే యున్నా

గము. లోహములు స్ఫటికాకృతులను (Crystals) దాల్చు టను గనిపెట్టుచున్నాము. స్థాణువువలె జడపదార్థమువలె నున్న భూమియందుసహితము మరకతస్థలములు పల్లములగుచు బల్లపుప్రదేశములు మెరకలగుచుండుటలను గాంచుచు న్నాము. దీనినిబట్టి మన స్థూలదృష్టికి జడపదార్థములువలె దోఁచువానికిఁగూడఁ జలనము, జీవము గలదని మనము గుర్తిం పవలసియున్నది.

లోహపాషాణాదులనుబోలిన చలనముగలిగి వాని తోఁ దుల్యుఁడనఁదగు మనుష్యునిలక్షణము లెవ్వియో విమ ర్శింతము. ఒకరాట్నమందలి కదురుగాని, యొక బొంగరము గాని గిఱ్ఱుమని తిరుగుచుండుటను బాలపర్యాయములు మనము కనియున్నాముకదా! బొంగరము వడిగఁ దిరుగనిండు! కదురు వేగముగఁ జుట్టుకొననిండు! అవి తీవ్రముగఁ దిరుగుచున్నప్పు డొకింత నిలుపుజేసి చూడుఁడు! బొంగరము తిరుగుచుండఁగఁ బిల్లవాండ్రు పరమానందముతో గంతులువేయుచు చేతులఁ జప్పట్లుకొట్టుచు బొంగరమును బట్టుకొందురుకాదా! ఆబొం గరమప్పు డెచ్చట నుండుచున్నది? ఏస్థలమందుఁ దిరుగుచున్న ట్లగపడుచున్నదో, యాస్థలమందే నిలిచిపోవుచున్నది. ఇట్టి పరి భ్రమణమునే యాత్మప్రదక్షిణమని చెప్పుదురు. పరిభ్రమణ మున్నది. చలనమున్నది. కదలికయున్నది. కాని యాచలనము వల్ల నేమిలాభము? తనచుట్టుఁ దాను దిరుగుటవలన నెవరికేఁ బ్రయోజనము? ఎంతవడిగఁ దిరిగిననేమి? బొంగరపుగుడి, కదు రొసరప్పు గిర, యొకచలనమని పేరుపెట్టఁదగినమాత్రము మున్న

దా? ఆత్మప్రదక్షిణమును జలనమని చెప్పదగినచో, నక్షత్రప్రద
క్షిణము సల్పుమనుష్యుని లోహజాతిలోఁ జేరినవాఁడని యన
వచ్చును. ఈలోహజాతిమానవుని నిరూపించుటకే ముందు
పటములో మిక్కిలి చిన్నసున్న, బిందుసమమగు సున్న
వ్రాయఁబడినవి

మీరందఱుఁ బ్రకృతిశాస్త్రమును జదువుకొన్నవారు.
ప్రపంచమందలి చలనశక్తియంతయు నేయాకారముగనే
యుండునని మీకుఁ బ్రత్యేకించి ఋజువుచేయ నగత్యములేదు.
గణితశాస్త్రములోఁ జలనమును గీతలతో నిరూపింతురు. అం
దుచేతనే మనమిప్పుడు గుండ్రపుగీతలతోఁ బనిసేయుచున్నా
రము.

బిందుసదృశమగు, బొంగరపు కైవారముతో సాటి
యగు జీవితములను గడపుమానవులెవ్వరో యూహింపుఁడు.

మూఁడుదినముల ముచ్చటయగు తమశరీరములే సర్వ
ప్రపంచమనుకొనుచు, మాకాయుష్యము, మాకారోగ్యమని
తలంచుచుఁ దిండిపోతులై, త్రాగుబోతులై, తుచ్ఛములైన
యింద్రియసుఖములనే సర్వదా యపేక్షించుచు, మన్న
మిన్నెఱుగక సంచరించు మానవుల నేతరగతిలోఁ జేర్పవల
యునో యొకింత చింతింపుఁడు. సాటిసోదర మానవులమాట
యటుంచుఁడు. ఇరుగుపొరుగువారలమాట నావలఁ బెట్టుఁడు,
ఆలుబిడ్డలమాటగూడఁ గడకుద్రోచి కేవలము తమ దేహపుష్టి,
తమ దేహారోగ్యము, తమ దేహసౌఖ్యములనే యపేక్షించు
మానవోత్తముల నేతరగతిలోఁ జేర్పవలయును? దారాపుత్రాదు

లన్నవస్త్రములులేక నులమల మాడుచున్నను సరే, తాము మాత్రము మూరంబుదులవలె ఒలపియుండవలెను. మంచి విలువ గల బట్టలను ధరింపవలెను. తినవలయును. "టిపురంగా" యనుచు దిరుగవలయును. తన దేహసౌఖ్యమునకెట్టియాటంకములు గలుగనంతవఱకుఁ బ్రపంచ మేమయినను సరే, తన దేశము, జాతి, కులము, బంధువర్గము, కుటుంబములున్నను నశించినను దనకు నిమిత్తములేదు. ఏది యెటుపోయిన నేమి! తనవిషయసుఖమే తనకుఁ బ్రధానము. ఇట్టివారు ప్రాణము గల జీవులే. వీరొకచోటనుండి యింకొకచోటికి సంచార పరిభ్రమణాదులు సలుపుచున్నారు. వీరు బ్రతుకునకు మాత్రము మనుష్యగణములోఁ జేరినవారే. కాని వారేయేదిక్కుల సంచరించుచున్నను, దమదేహసుఖమే ప్రధానలక్ష్యముం దుంచికొనుచున్న జీవులు.

భూగోళము గిఱ్ఱున నతివేగముగఁ దిరుగుచున్న నొక యంగుళపు స్థలమైనఁ గదలని తెఱఁగున నీపురుషరత్నములును సకలదేశములఁ బుట్టివచ్చినను దమ హృదయములందు స్వీయదేహసౌఖ్యములను మించి యొక్కటియున్నదైన నావల బ్రపంచమున్నదని తలంపలేరు, తలంపరు. వీరు చుట్టునకు మధ్యమున దామే; అగరికై వారము తమ దేహమే. ప్రపంచ చరిత్రలో నిట్టిపురుషు లనేకు లుద్భవించుచున్నారు. వారిలో మిగుల బ్రఖ్యాతివహించినవా రనేకులు జనించినారు. వారు పురుషరత్నములే యగుదురు. కాని యేమి లాభము? రత్నములు, ముత్యములు, కెంపులు, మరకత మాణిక్యాదులు

రజతహేమములు మొదలగు జవాహరి సరుకులన్నియు లోహ
వర్గములో, ఖనిజగణములోఁ జేరినవే. ఒకరత్నము వెలలేని
దయ్యు సృష్టిజాలములో నధమాంతరమందున్న ఖనిజవర్గము
లోఁ జేరినదే యగుచున్నవిధమున, నీపురుషసింహులుకూడ
నెంత ఖ్యాతివహించినవారలయ్యును, బురుషాకారకృతినున్న
లోహజాతిసదృశులగు జీవులు మాత్రమే యగుచున్నారు.

రోమనురాజ్యచరిత్ర నొక్కమాఱు తిలకింతుమేని,
రోమీయప్రభువులలో నీరో, టీబీరియసు, సీజర్లు మొదలు
గాఁగల మహాచక్రవర్తులు, నిర్వక్రబలపరాక్రమశాలులు,
నకుంఠిత ధైర్య తేజోవిలాసితులు, నప్పటికిఁ దామెఱింగిన భూమం
డలమునంతను జండశాసనులై యేలిన రాజన్యశిరోమణు లనేకు
లుదయించి యస్తమించిరి. కాని వారందఱుఁ జాలవిలువ
గల రత్నముల సాటివారైయున్నారు. ఏలన, వారు తమ ప్ర
తిభకొఱకు, నాత్మఖ్యాతికొఱకు, జగద్విజయము మొనర్చిన
వారలే కాని తమ దేశప్రజలు సురక్షితముగ నున్నారా, లేదా
యని విచారించినవారుకారు. తమ మిత్రకోటి, బంధుగణము
దారసుతాదులేమయిరి? వారు సుఖముగనున్నారాయని
యెన్నఁ డడిగినవారుకారు. ఎంతవఱకును దమఖ్యాతి దిశదిశ
లకును వ్యాపించినదా, లేదాయను కోర్కెయొక్కటే వార
హృదయములను సదా యావహించియుండెను. ఆదేశ చరిత్రను
జదువుదురేని వారలొనర్చిన ఘోరకృత్యములు, మారణ
కర్మములు మీకు విశదముకాఁగలవు. ఆ యవనీపాలు
రలో నొక్కనిగూర్చి యొక్క చిత్రకథ కలదు. వినిపించెదను

వినుండు. ఆరాజునకు మధురపదార్థభోజనమం దమితాసక్తి యుండెనఁట. అతఁడు దివారాత్రములు లాడూ, హల్వా మొదలగు ద్రవ్యములఁ వెఱపిలేనంతగ భుజించుటచే నాతని జఠరకోశము తిరుగుపాటుఁ జెందెను. అంత నాపార్థివుఁడు భుజించిన వస్తువులను వమనముచేసికొనుటకై మందులు సేవింపఁ దొడఁగెను. వమనమైన వెంటనే మరలఁ గడుపునింపుట, మరల నౌషధసేవ తిరిగి వెడలఁగ్రక్కుటలనొనర్చుచుండెనేకాని పొట్ట నింపుటమాత్రము మానఁడయ్యెను. దినమున కనేకపర్యాయము లిట్లొనర్చుచుండిన యీనృపాలవరాళి పురుషనామార్హుఁడగు మానవుం డందురా లేక జీవరాసులలోఁ గనిష్ఠమగు లోహజాతివాఁడందురా? మఱియొక భూనాథుఁడు మహాగ్నిజ్వాలలను, దావానలమును జూడఁ గుతూహలుఁడై తనరాజధానిని దగులఁబెట్టించి తాను దూరమం దొకగుట్టపై నుండి చిత్రహోత్రజ్వాలావృతమైన యాపట్టణమును గనుచుఁ బరమానందభరితుం డాయెను. క్షుద్రమైన యాతనికోర్కెఁ దీర్పఁ గొందఱుజీవు లాయగ్నిహోత్రునకు బలియై హతమయిరో వానికిఁ గించిన్మాత్రమైనఁ జీమకుట్టినట్లైనఁ దోఁచినదా? ఈపురుషుఁడు మానవనామార్హుఁడా? పిశాచినీచుఁడయిన మానవనామమాత్రధారియా? యమూల్యపురుషరత్నములు, దివ్యమైన యీ మనుజులు ఖనిజవర్గులో జేరిన మానవులని సిద్ధాంతీకరించితిమి.

ఇఁక వృక్షజాతిలోఁ జేర్పఁదగిన మనుష్యుల వ్యవహార మెట్లుండునో చూతము. దూర మాలోచింపకయె వారు

లోహజాతిమనుష్యులకంటె నధికులని చెప్పుట కెట్టి యాక్షేపణ మక్కఱలేదు. ఏలయన, స్థాణువువలె జడత్వ మందియున్న లోహముకంటె సంకుచించుట, చిగుర్చుట, యాకులు, కొమ్మలు వేయుట, వృద్ధిఁబొందుట మొదలగు వికారములఁ బాల్పుటచే జీవసంచలనముఁ గనఁబఱచువృక్షము లధికములయిన ట్లే యాలుబిడ్డలు చచ్చిపోవుచున్నను లక్ష్యముసేయక తనదేహ సౌఖ్యమే పరమప్రాప్యమని కన్నుగానక చరించు మూఢుని కంటె నేనలుగురైదుగురు వ్యక్తులతోడనో కూడుకొని యున్న కుటుంబముయొక్క క్షేమ మారయువాఁ డధికుఁడు కాఁడా? ప్రపంచముం దెందఱెట్లు తమకుటుంబ లాభ క్షేమముల కొఱకుఁ బాటు పడుట లేదు! మనమిప్పుడు గనుచున్న మానవ కోటిలో మూఁడునంతులట్టివారే యనుట యతిశయోక్తి కాజాలదు. ఎవని యాలుబిడ్డలను వాఁడు పోషించుకొనుచో నట్టివాని జన్మమంపెంత యెక్కువగఁ బరిగణింపఁ దగిన దేమున్నది? కాదా యెననఁ దనపొట్టపోసికొనువాని కంటెఁ దనకుఁదోడు మఱిరెండు పొట్టలనుగూడ భరించువాఁ డధికుఁడనవచ్చును. ఈకలికాలములో నాలుబిడ్డల కన్నము పెట్టువాఁడుకూడ యోగ్యుఁడనియే చెప్పవలసియున్నది. వాఁడు తన యాత్మవంటి యాత్మలు మఱికొన్ని యున్నవని, తెలంచి వారిక్షేమలాభము లరయఁగలుగుటచే, వానియాత్మ యొకింత వికసించినదని, కొంచెము పరిణామముఁ జెందినదని చెప్ప వచ్చును.

బొంగరము తనచుట్టును దాను దిరుగుచున్నది. ఆత్మ ప్రదక్షిణముఁ గావించుచున్నది. ఒక పంచెపుగుఱ్ఱము, లేక సర్కసుగుఱ్ఱము, బొంగరముకంటె నెక్కువ వలయము జుట్టి వచ్చుచున్నది. మొదటివానిని బొంగరముతోఁ గమకుతోఁ బోల్చితిమి. కావున, నీ రెండవయాత్మను సర్కసు, లేక పంచెపు గుఱ్ఱముతోఁ బోల్పవచ్చును. ఈసర్కసు, లేక పంచెపుగుఱ్ఱము లెట్టిగతి జుట్టుచున్నవి? అవిచుట్టివచ్చు బింబములోపలివస్తువుల వైపున కభిముఖమగుచున్నవి. బింబమధ్యపు దెసకు దృష్టినిడుచు చున్నవి. వానిమనసు, వానిదృష్టి, వానిముఖము బింబాంతరస్థ పదార్థములవైపునకే లగ్నమగుచున్నవి. ఆబింబపుకైవారమున కావలనున్న వస్తువులవైపునకుఁ బెడమొగము పెట్టుచున్నవి. బింబబాహ్యపదార్థములదెసకు వీపుఁద్రిప్పుచున్నవి. బింబమధ్యో న్ముఖదృష్టిని (Concave vision) అనియు, బింబపరాఙ్ముఖదృ ష్టిని (Convex vision) అనియుఁ జెప్పవచ్చును. పంచెపు లేక సర్కసుగుఱ్ఱము పరుగెత్తును. ఖదను ద్రొక్కును. చిత్రగతుల నడచును. బొంగరముచుట్టుగిరకంటె నాత్మప్రదక్షిణముకంటెఁ బెద్దవలయము చుట్టును. ప్రాకారము పెద్దదే. కాని రెండు మూఁడాత్మలచుట్టు నొనర్చు ప్రాకారమేకాని యంతకన్న నాధిక్యము లేదు.

ఈగుఱ్ఱములకుఁ గొన్నిటిపట్ల సుముఖతయు మఱికొన్ని టిపట్ల విముఖతయు నున్నది. సుముఖత యెవరిపైఁగలదో వారిని ప్రేమించుటయు, నెవరిపై విముఖత కలదో వారిని ప్రేమింప కుండుటయు సిద్ధించుచున్నది. దీనినే రాగద్వేషము లనియు

(Concovity & convexity) యనియుఁ జెప్పుదురు. కడమ ప్రపంచ మేమైననుసరే, పొరుగువా రేమైననుసరే, నాకుటుంబము నేను సుఖముగనున్నంతకాలము నాకేమిగొదువ యనుకొనువారిని సూచించుటకే 'యు' మధ్యముగఁగల రెండవసున్న వ్రాయఁబడినది. బిందువు వంటిసున్న. చుక్కవంటి సున్న "హ" యనుస్వలాభపరాయణత్వ సూచకమగు సున్నకంటె 'యు' సున్నతరగతిలోఁ జేరినస్వకుటుంబలాభపరాయణుఁడు హెచ్చువవాఁడు. మొదటివాఁడు లోహవర్గములోనివాఁడు, ఖనిజ జాతిలోనివాడును, రెండవవాడు వృక్షవర్గము లోనివాఁడు, నుద్భిజ్జ జాతిలోనివాడు నగుచున్నాడు. రెండవవాఁడు మొదటివానికంటెఁ జాల మంచివాఁడై యగును. స్వశరీరము మీఁదమాత్రమే కాక మఱి నలుగురిమీఁదఁ దనప్రేమను బ్రసరింపఁజేయుచున్నవాఁడు. మంచివాఁడు కాఁడని యెవ్వరనఁగలరు? వానికిఁ దనవారిపైనమాత్రమే ప్రసన్నత కలదుగాని వానికుటుంబమునకు నింకొక కుటుంబమునకు నేవిషయమును గూర్చియైన వైరము, పోట్లాట, సంభవించినప్పుడా రెండవ కుటుంబమువారిపై నాతనికిఁగలుగు కోపమునకుఁ బట్టఁబగ్గము లుండునా? తనవారివంకఁ బ్రసన్నతయు బరులపై వైరమును జూపువానిని వృక్షవర్గములోని వానినిగఁ జెప్ప నిశ్చయించితిమి.

ఇఁక మూఁడవసున్నదగ్గఱకుఁ బోవుదము. "ర" మధ్యముగాఁగల మూఁడవసున్న వెనుకటి రెండుసున్నలకంటెను బెద్దదికదా! ఈసున్నమధ్యము "హ" యను బిందువునుండి దూరమైనది. ఎవ్వఁ డాకుదూరమైనదో కైవారమువ్వఁడే

పెద్దదైనది. చిన్నగిరి కైవారముకంటెఁ బెద్దకైవారము మంచిది
కాదా? అట్లే ఖనిజ వృక్షగణములకంటె జంతుగణ మెక్కు-
వనుట కెట్టి యాక్షేపణయు లేదు. తన దేహసౌఖ్యము దన
కుటుంబ సౌఖ్యముకంటె మఱికొన్ని కుటుంబములను బ్రేమించి
వారి యందఱి సౌఖ్యము నపేక్షించువాని యాత్మ యెక్కువ
వికాసమందినది. యెక్కువ పరిణామమందినదనుట కభ్యంతర
మేమున్నది? బిందువు (Point)మున వ్యాపించు యహంభావము నహం
కారము దన దేహముతో నైక్యమయియుండెను. పెద్దగిరిచుట్టిన
'యహ'వలయము జుట్టిన మనుష్యుని 'యహ'ము తన కుటుంబ
ముతో నన్వయించినది. ఇద్దఱకు నహంకారము కలదు కాని రెం
డవవాని యహంకారము కొంచెము పెద్దదైనది. వికసించినది.
మూఁడవవాని "యహం"కారము వాని స్వార్థము బాలకుటుం
బములతో నన్వయించుచున్నది. ఒక్క కుటుంబమున నడఁగి
యుండక చాలకుటుంబములకు వ్యాపించిన వాని ప్రేమ, వాని
యాత్మ వెనుకటి యిద్దఱికంటె గొప్పది, ఘనమైనది కాదా?
మూఁడవవాని కహంకారము కలదు. కాని వాని యహంకా
రము సామాన్యమైన యహంకారము కాదు. వాని యహం
కారము పెద్దయహంకారము. వానికి స్వాతిశయము విస్తార
ము. కొద్దియహంకారములు గల యనేకవ్యక్తులను సమదృష్టి
తోఁ జూడఁగల పెద్దయహంకారము కలవాని నిమూఁడవ వల
యములోఁ జేర్పవచ్చును. వీరియుద్దేశములు ఘనమైనవి. వీరి
యాశయములు స్తోత్రపాత్రములైనవి. లోహజాతిమానవుల
వలెను, వృక్షగణపుమానవులవలెను వీరిదృష్టి కుంచితముగ

నుండదు. వీరి యాలోచనలు చాల భారీయాలోచనలు. వీరి
దృష్టి కడు విశాలమైనది. వీరి భ్రమణము అయనవాయువుల
(Trade winds & Monsoons) పరిభ్రమణమువంటిది. సర్క
సుగృహము, పంచెపుగృహములు మట్టినచ్చు గికులకంటె నీవా
యువులు చాల ప్రాంతములకు పిడి వాణిజ్యమునకెంతే నుపకా
రకములగుచున్నవి. ఒకప్పుడవి యొకదేశములో బయలుదేరి
యనేక ప్రాంతములు దాటి మఱెక్కడనో వర్షించును. అనేక
ప్రాంతముల కుపకరించు (Monsoons) వర్షపుగాలివలెనే యనే
క కుటుంబములతోఁ గూడిన పెనకులము, తనవర్ణమువారి
క్షేమము, నభ్యుదయము, సౌన్నత్యమును గోరుచు వారి యం
దరికొఱకుఁ బాటుపడు వాఁడేతియుఁ బ్రశంసాపాత్రుఁడను
టకు సందియములేదు. ఎవ్వనికిమీఁదను ప్రేమాభిమానములు
లేనివానికంటె స్వశాఖీయులు, స్వకులస్థులగువారిపట్లనైన
సుముఖుడగువానిహృదయము విశాలమైనది. వానియహ
ము విస్తృతి మైనదనుట నిశ్చయము. ఇట్టి సువిశాలహృదయుని
హృదయవైశాల్యము కనంత పరిశోధించితిమి. తనకుస్వీయులని
తలంచుకొనుచుండిన స్వవర్గస్థులు క్షేమముగ నున్నంతకాల
మాతఁడు హసన్ముఖుఁడుగనే యుండును. కాని స్వకులస్థులకును,
నితరకులస్థులకును భేదము, వైరము కల్గినప్పుడు వాని శాం
తము, వానివదనము దిలకించినచో సత్యము బయలుబడును.
వీరియందును బ్రసన్నత, సాముఖతయు (Concavity) నన
హిష్ణుత, విముఖత (convexity)యు గలుగుచున్నవని తేటపడు
చును. తాముచుట్టుకొన్న, నిర్ణయించుకొనినగుడిలోపలనున్నవారి

యెడ రాగము, నాకై నాశమున కావలసియున్న వారిపై ద్వేషమును
కలిపికొనిన స్వార్థపరులు పెద్దలని పూజ్యులని గౌరవించిన గౌర
వితురుగాక! నిష్పక్షపాతసత్యవిమర్శకుల దృష్టిలో వారంత
యధికులని పరిగణింపబడఁజాలరు. ఏలయన, వీరు తమపక్షము
వారి కెంతమేలు చేయుచున్నారో, పరపక్షులకంత కీడును గలు
గ జేయుచున్నారు.

రాగద్వేషములకు లోనైన వీరిని జంతువర్గపు మానవు
లని సిద్ధాంతీకరింపవలసివచ్చినది. అయినను వీరు లోహ
వృక్షజాతుల మానవులకంటె ననేకతరము లెక్కువవారని
యొప్పుకొనక తప్పదు. మఱియు వీరును జాలమందివారని మా
యభిప్రాయము.

ప్రకృతియందొక చిత్రమైన ధర్మమున్నది. అదేమి
యన, నెవ్వఁడుగాని యొక్కచోటనే స్థాణువువలె నిలువరాదు.
ముందునకు సాగుచుండవలె ననునది. కదలిక లేనివానికి జడత్వ
ము ప్రాప్తించును. వానిని దమస్సావరించును. అనఁగ మాం
ద్యము, బుద్ధిజాడ్యము వాని పరమగును. చలనమువల్లనే ప్ర
పంచమంతయు నిప్పటికప్పుడు నూతనముగను భోగ్యముగను
గనఁబడుచున్నది. నేను కదలనని మూర్ఖించి కూర్చుండువాఁ
డెన్నియుగములకైన నష్టెయుండి యుండుటకు నిందాపాత్రుఁ
డగుచున్నాఁడు. మానవుఁడు భూమిపై జనించినపిమ్మట బాల్య
యౌవనకౌమారాద్యవస్థలను గ్రమముగఁ జెందుచుఁ బెంపొం
దుట శుభకరమే కాని, పైయవస్థలు వలదని మూర్ఖించుచో
వాని కభివృద్ధి యుండునా! అలాగుననే లోహజాతి మానవు

డు వృత జాతిమనుష్యుడుగాను, నలుపిమ్మట జంతువర్గపు మనుష్యుడుగాను బరిణామమందుట ఎంతయు శ్రేయస్కరము. కాని యంతకంటె నధికమైనయవస్థ యున్నచో దానిని జెంద నభిలషింపవలెగాని,యున్నచోట నె తనివిజెంది యూరకుండుట మంచిదికాదు. క్రైస్తవ వేదమగు బైబిలులో నొక కథయున్నది. సొదోము, గొమోరాయను పట్టణములు దహనమగుచుండ వాని యధిపతియగు 'లా'టనునతడు భార్యాసమేతుడై యా నగరములను విడిచి పరుగెత్తుకొనిపోవుచుండెను. అతడు భార్య ను వెనుకకు దిరిగిచూడవలదని చెప్పెను. కాని యామె యా పట్టణములపై నభిమానమును గోసివేయజాలక కొంతదూర మేగినతరువాత వెనుకకు దిరిగిచూచెను.

ఆమె యేతావున దృష్టి వెనుకకు మరల్చెనో, యచ్చ టనే యుప్పుస్తంభమై నిలిచిపోయెను. కావున వెనుకదృష్టి పెట్టుకొనక యెల్లప్పుడును ముందునకు దృష్టిసారింపవలెనని యీకథ బోధించుచున్నది.

మనము నాశరీరము, నాబిడ్డ, నాపాప, నాకుటుంబము, నాశాఖ, నాకులములను గట్టిగా గౌగిలించి పట్టుకొని వానికి బానిసలమై యుండుటయే మనమొనర్చుచున్న మహాపరాధము, మహాదోషము. సర్వస్వాతంత్ర్యవగు నీ వొక కులమునం దొకకుటుంబమునం దొకదేహమునం దభిమాన మొందుదువు? ఈతుచ్ఛమగు, నీక్షుద్రమగు, నామరూపములచే బద్ధుడవై నీ జన్మస్వాతంత్ర్యమును గోలుపోవజూచుచున్నా వా? మేల్కొనుము? దబ్బున లెమ్ము మెట్లెక్కుము. స్తబ్ధత నాశన

హేతువు. చలనము జీవలక్షణము. శాఖాకులవర్ణాభిమా
నముల నణచివేసి, యుల్లదే! యోగపలినోపాన మధిగమింపుము.

ఇప్పుడు మనము 'ల' మధ్యముగాఁగల నాలుగవ
సున్నకడకు వత్తము. ఈగిరిలోని మనుష్యుఁ డసలు మనుష్యుఁ
డనవచ్చునా. అనఁగా, మనుష్యవర్గములోఁ జేరుచున్నాఁడని
భావమా. మనుష్యుఁడు మనుష్యవర్గములోఁ జేరుటకూడ
యబ్బురమాయని యడుగవలదు. ఇంతకుముందు మానవ
దేహమునుదాల్చి మనుష్యుఁని పిలువఁబడువారిలో ఖనిజ,
వృక్ష, జంతువర్గములలోఁ జేర్పదగువారిని గాంచియుంటిమి
కదా! అందువల్ల మానవనామమున కర్హుఁడగువానిని గూర్చి
యిప్పుడు విచారించుట యావశ్యకమయినది. ఈ నిజమైన
మనుష్యుని యహము చాలఁబెద్దది. అతని 'యహ'ము క్షు
ద్రమానవులకుఁగల కొద్ది యహముకాదు. నాదేహము, నా
యిల్లు, నావర్ణము లనునవి వానిముందఱ నల్పవిషయములు.
వీని యహముయొక్క పరిమితి చాలవిస్తీర్ణమయినది. ఈ
నాల్గవగిరి మానవుఁడు "అహ"మని పలుకునప్పుడు "నాజాతి,
నాదేశ"మను విశాలభావముతో వచించుచున్నాఁడు. వానికి
నహంకారము కలదుకాని, యాయహంకారము వానిజాతితో,
వానిదేశముతో నైక్యమైనది. తనదేశీయు లందఱిసుఖదుఃఖ
ములే వానిసుఖదుఃఖములు. వానిహృదయము వికసించినది.
వానియహంకారము బాహుళ్యమై, దేశమంతటా నావరించి
నది. దేశముయొక్క యాత్మయే వానియాత్మ లీనమైపోయి
నది. మేలు మేలు ఇట్టిపురుషుల యోగ్యత యెంతయుఁ గొని

[illegible] దానిది. నాకొక స్వార్థములేదు. అనఁగా దన దేహ
సంరక్షణమం దపేక్షలేదు. వాని స్వార్థమున కర్థము వేఱున్నది.
అదియేమది? ఒకకులము, నొకమతము, నొకప్రాంతము, నొక
భాష యను భేదములు లేని యేకజాతి, యేకదేశము వానిస్వా
ర్థమున కర్థము. "నేన"ని వచించుచో "నాదేశ"మను నర్థము
లోనే వచించు నాతఁడిట్టివాఁడని వర్ణింప మన తరముకాదు.
వాని దేశమందు వసించు బీదసాదల కష్టనిష్ఠురముల గనినప్పు
డతఁడుపొందు హృదయవేదనముఁ బరితాప మింతింత యన
రాదు. వీని యహంకారమునను, వీని స్వార్థమునకుఁ బెద్ద
యర్థము నుత్కృష్టార్థము నాపాదించుచున్నారా, లేక వీఁడు
నిజమైన స్వార్థత్యాగియేనా? వీని యహంకారము పూర్తిగ
నశించినదా? దీర్ఘముగఁ బర్యాలోచనఁ జేయుఁడు! వానిహృద
యమందలి యథార్థస్థితి యప్పుడు నీకుబోధపడును.

చంద్రుఁడు భూమిచుట్టును దిరుగుట మీకుఁ దెలిసిన
విషయమేకద. చంద్రుఁడొనర్చు భూప్రదక్షిణ మెంత పెద్దదో
యాలోచింపుఁడు. చంద్రుఁడు పెద్దగిరి చుట్టుచున్నవాఁడనుట
వాస్తవము. మఱియు, నాతని మండలము పూర్ణగోళాకారము
కాదు. అతని ప్రదక్షిణము పూర్ణవర్తులమనుటకంటె నండా
కారముగ నున్నదనుట సత్యమునకు దూరముకాదు. సుడిగాలి
వ్యాపకమునకుఁ దుల్యమగు మూఁడవసున్నకంటెఁ జంద్రప్ర
దక్షిణ తుల్యమగు నాలుగవసున్న యాకారమునందు వర్తుల
తమును గొంతఁగోల్పోయినను నైవారము మాత్రము సహా

ప్రాధికముగఁ బుట్టి వచ్చుచున్నది. చంద్రుని భూప్రదక్షిణ పరిమాణము సామాన్యమైనదా?

'ల' మధ్యముగాఁగల చక్రముతోఁ బోల్పఁదగువారలే ఘన స్వార్థత్యాగు లనఁబడు దేశభక్తులు. 'హ యు' లను బిందువునుండి 'ల' వఱకు వ్యాపించిన యూకు (Radius) పెద్దదైనది. బిందువునుండి మధ్యము చాల దూరమైనది. కైవారము పెద్దదైనది.

బొంగరము, గుఱ్ఱములు, సుడిగాలి యొనర్చు ప్రదక్షిణములకంటెఁ జంద్రప్రదక్షిణ మనేక సహస్రాంశము లధికమైనదేకాని దేనినో యొకదాని నాశ్రయించుకొని ప్రదక్షిణము సల్పుటమాత్రము విరమింపలేదు. సున్న యొక్క వర్తులత చాలవఱకుఁ దగ్గినది కాని యసలు పరిభ్రమణము మాత్రము మానలేదు. ఉత్తరగతిలోనివారే సకలదేశములలోని దేశభక్తులును, ఏరే యాయాదేశీయులచే స్వార్థత్యాగులని యభినందింప బడుచున్నవారు.

నిజమును బరికించితిమేని పిచ్చికిని జంద్రునకును గొంత సామ్యము సిద్ధించుచున్నది. చంద్రునిఁజూడఁగనే సముద్రము త్తుంగతరంగితమై తన సంతోషమును వెలిపుచ్చుచున్నది. సముద్రజలపుఁ బోటుపాటులు చంద్రోదయాస్తమయముల ననుసరించి యేర్పడుచున్నవి. పిచ్చివాండ్రకును జంద్రునికిని దగ్గఱ సంబంధమున్నది. పూర్ణిమ సమీపించుటకొలఁది నున్మత్తుల పిచ్చి యధికమగుచుండుట లోకమందఱకుఁ దెలియును.

కావున యెంతవఱ్ఱులతత్గ్గినను గొన్నిటిపట నభిమానము, సుముఖత్వము, సుప్రసన్నత, రాగమున్నంత వఱకుఁ దద్వ్యతిరేక వస్తువులపట విముఖత యుండకతప్పదు. ఇది సిద్ధాంతము. ఇంతమాత్రముచే దేశభక్తులను మేము నిరసించుటలేదు. వారుసామాన్యమానవులుకంటె శతసహస్రాంశములెక్కువవారని మా నిశ్చితాభిప్రాయము. వారు మాకుఁ బూజార్హులలో నగ్రగణ్యులు. వారియందు నీచమైన క్షుద్రమైన యహంభావము నశించి మహావిశాలమైన దేశమంతను నిముడ్చుకొనఁగల పరిణామమును వికాసమును బొందినది. అది యెట్లన విత్తనము నశించి మహావృక్షమైన చందమునఁ జిన్నయహము నశించి పెద్దయహము ప్రబలినది. ఇదిచాలా నెక్కువమాటయె కాని దేశభక్తులయందు మాకుఁగల గౌరవభావమున కెట్టి న్యూనతయుఁ గలుగకుండఁ దత్త్వనిర్ణయ మొనర్చుటయె మాపనియైనందున, ఁగాని, (But) యని యొకింత చెప్పవలసియున్నది. దేశభక్తి సంస్తవనీయమైనదేయైన నంతకన్న నధికమగు సంక్షిప్తత్వ నది యెట్లుభాసించునో చూడవలసియున్నది. సత్యము కొంతకంటకము గల్గింపకమానదు. గులాబిపుష్పమును గోయనుంకించువాఁడు ముల్లుగుచ్చుకొనునని జంకవచ్చునా?

దేశభక్తులవలన వారివారి దేశములకును, దేశీయులకు నెంతలాభము, క్షేమము సమకూరెనో తద్వ్యతిరిక్తదేశములకును, దత్ప్రజలకును నంతనష్టము వాటిల్లినది. దేశమునకును దేశమునకును, జాతికిని, జాతికిని విరోధములు, సంఘర్షణా

ములు, యుద్ధములు, నాయా దేశభక్తులవల్లనే తటస్థించినవని మఱ
వకుఁడు. కోటానకోట్లు ప్రజలు జాతివైషమ్యములచే రెచ్చఁ
గొట్టఁబడి యన్యోన్యహననకార్యదీక్షాపరతంత్రులై కనుల
పండువగ నేయు పచ్చనిపంటభూముల నాహవరంగములుగను
సస్యరాసులతో నిండియుండవలసిన వసుంధరమును రుధిరమ
యములుగను మార్చివేసి భూదేవికిఁ దలవంపులు సంఘటింపఁ
జేయుచున్నారుకద! వీరా సీజరులు, అలెగ్జాండరులు, నెపోలి
యనులు, వాషింగ్టనులు నట్టివారే. వీరందఱకుఁ దమదేశీ
యులపై ననురాగము (Concavity) వైరివర్గముపై ద్వేష
మును (Convexity) గలవు. అమెరికనులు వాషింగ్టనును
దలంచెదరు. అతఁడు మహావీరుఁడు. మహాయోధాగ్రేసరుఁ
డని ప్రతియమెరికనుఁడును వానిని నిత్యమును బూజించుచుం
డును. కాని యింగ్లీషువారి కతనినిగూర్చి యెట్టియభిప్రా
యముకలదో చూడుఁడు! నీచాతినీచుడని వారాతనిని దెగ
నాడుదురు. ఇట్లే ఫ్రెంచివారికి నింగ్లీషువారికిని నెపోలియనును
గురించి భిన్నాభిప్రాయములు కలవు. ఇంగ్లాండు దేశభక్తులు
తమదేశమునకు సంబంధించినవఱకు నుత్తమపురుషులు, మహా
యోగ్యులు. కాని స్వీయదేశలాభముకొఱ కే దేశప్రజల
రుధిరమును బ్రాణములను బీల్చివేయుచున్నారో వారల యభి
ప్రాయ మడిగినప్పుడు వీరిదేశభక్తి యెంతగా గొనియాడదగి
నదో తెలియనగును.

కావున దేశభక్తి యెంతస్తోత్రపాత్రమైనదైనను దేశ
భక్తుల హృదయము లెంతవిశాలములై వారియాత్మ విశేష

పరిణామవికారములుండినను, వారు నిజమైన మానవనామ వాచకముల కర్హులయినను, వారికిని రాగద్వేషములను (Concavity & Convexity) బూర్తిగ విడనాడలేదనియు నంత కంటె నుత్తమావస్థ యొకటి కలదనియు; నందు రాగద్వేషము లుండుటకుఁ దావులేదనియు, నట్టిమానవులమే సాక్షాద్గతి యనఁ బడుననియు మనము గ్రహింపఁదగియున్నది.

అది యెట్టిదో చూతముగాక. ఇదివఱకు మనము నాలుగుసున్నలనుగూర్చి విచారణ యొనర్చితిమి. ఇప్పు డైదవదానికడకు వత్తము. ఆసున్న నీపటములో వ్రాయలేదని యాగ్రహింపకుఁడు. ఆసున్ననిందు మండలాకారముగ వ్రాసి చూపలేదు. ఆసున్నకు మధ్యము (Centre) అనంతవిశ్వ మునకు వ్యాపించినది. ఈకు (Radius) అనంతమై (Infinite) నప్పుడు సున్నకైవారమెక్కడ నగపడును? ఆసున్న సాక్షాద్గతి (Straight line) కావలసి యుండును. ఆసున్నకు వంకర టింకరలుండఁజాలవు. వస్తుతః సుముఖవైముఖ్యములు, నిమ్నోన్నతములు రాగద్వేషములు లేకుండ నాసరళరేఖ (St. line) యనంతవిశ్వములో నేకరీతిని వ్యాపించును. జగజ్జాలములన్ని యు దానిసూటికి వక్రత్వము గల్పింపఁజాలవు. అట్టి వక్ర దృష్టిలేనట్టియు, రాగద్వేషరహితమైనట్టియు, సూటిగీతవంటి మనుష్యులు కొందఱున్నారు. వీరు దైవసములు. అట్టివారిని దేవగణములోఁజేరిన మనుష్యులని చెప్పవచ్చును. సూటి గీతకూడ నొక సున్నయను శాస్త్రవాదప్రకార మీదేవ గణపుమనుష్యులు నొకవిధమగు మండలమును జుట్టి

వచ్చుచున్నారు. దానిని బోల్చ వలయము నన్ను సూర్యుని
వలయమును దృష్టాంతముగఁ దీసికొనవచ్చును. సూర్యుని
పరిభ్రమణము సూటిదప్పదు. సూర్యుని చారము సరళరేఖను
బోలియుండును. సూర్యుఁడు చుట్టువలయమునకు [illegible] (Radius)
అనంతము (Infinite) సూర్యుఁడనంత తేజోమూర్తి. రవి సక
లలోకబాంధవుఁడు. రవి సమస్తజగజ్జాలములకు మిత్రుఁడు.
అతఁడెచ్చటను శత్రువు లేని మిత్రుఁడు. అజాతశత్రుఁడు.
సూర్యుఁడు చుట్టినచ్చు వలయమున కెక్కడ జూచినను మధ్య
మే. కాని యిది గిరి, యిది కైవారమని నిర్ధారణచేయుట కేవియుఁ
గానరాదు. ఇదియే భగవచ్చక్రము. అట్టివారే స్వతంత్రులు.
వారికొక దుఃఖము లేదు? ఒక బాధము లేదు. ఒక భయము లేదు.
ఒక ద్వేషము లేదు. ఒక రాగము లేదు. అహంకారమమకార
ములు లేవు. ఇది నేనిది నాదియనుభావములు నశించినవాఁడు,
దేహాత్మబుద్ధిలేని యతఁడు సకలలోక సమ్మతుఁడగుచున్నాడు.
స్వేచ్ఛాచూరిత్రజీవనుండగు నాతఁడు దైవసముఁడననేల,
దైవమే యనవచ్చును. అనంతకోటిజీవరాసులలో నాతని
నాక్రమించున దొక్కటిలేదు. అతఁడు ద్వేషించిన దొక్కటి
లేదు. దేనిచుట్టు నాతఁడు తిరుగఁడు. ఒకదానిచే నతఁడు బద్ధుఁడు
కాఁడు. అతనియందు సకలపవిత్రములు నాశ్రయించుచుండినవి.

అతనిమండలము సూటిగీతయయిపోయినది. ఆసూటి
గీతలో నొకచుక్కమీఁదఁగాని, యొకబిందువుమీఁదగాని యా
తని కభిమానమే లేదు. చుక్కపై నభిమానము కలవాఁడు
పరిచ్ఛిన్నమైన దేహాత్మబుద్ధిగల మూఢజనుఁడు. సున్నలకును

గొన్నిటిపట్ల నాభిముఖ్యమున్నదని మనము గనియున్నారము. ఆభిముఖ్యవైముఖ్యములు లేని సాక్షిగీతియగుట యెంతటి భాగ్యము! నిస్సంకల్పుడు, స్వార్థరహితుడై భూమిపై జనించువారు కోటికొక్కరైన నుందురాయని మాసందేహము. వీరియందు స్వా (ఆత్మ) ర్థము (Selfishness) నశించినదా, లేక స్వారాజ్యము (ఆత్మసాక్షాత్కారము) ప్రాప్తించినదా? (Self gained?) మన మొక్క చుక్కతోఁ బ్రారంభించి, దానిని పెంచి, పెద్దజేసి తుదకు సూటిగీతగా విజృంభింపఁజేసినారము. చుక్క (బిందువు-Point) కును, సున్న, (వలయము-Circle) సూటిగీత (సరళరేఖ-Straight line) లకు గల భేదమును బాగుగ గమనింపవలయును. ఈసూటిగీతకుఁ దుల్యులగు మహానుభావులకుఁ బ్రపంచమే గృహము. వారల కొక కుల, మొక జాతి, మొక దేశ, మొక భాష, యొక వేష, మొక జాతి, యొక స్త్రీ యొక పురుషుఁడను భేదములు లేక యశేషవిశ్వ మొక్కటిగఁ గన్పట్టును. వానికి ఇంగ్లాండు దేశీయుఁడుగాని, యమెరికా దేశస్థుఁడుగాని, మహమ్మదీయుఁడుగాని, బౌద్ధుఁడుగాని, హిందువుడుగాని, మఱి యెవ్వఁడుగాని యందఱును దన యాత్మయే. అబ్బా! వాని యహంభావము! వాని యాత్మభావ మెంత విజృంభించినది! ఎంత యత్యద్భుతపరిణామ మందినది! వానికి విశ్వమంతయు 'నా' యాత్మలో నిమిడిపోయినదే. సెబాస్! ఖనిజ, భూమిజములు మొదలుకొని సకలప్రపంచము నేనే యనుకొనుచున్న మానవులు మానవులా? మానవావతారముఁ దాల్చిన యమరులా? అమరులకుఁగూడ మగల జన్మ మున్న

దేమో? వారికిమాత్రము జననమరణ రహితశాశ్వతానంద సంధాయకంబగు సాక్షాన్మోక్షసామ్రాజ్యమే యధీనముగుట నిక్కువము.

అట్టి బ్రహ్మసాక్షాత్కార మందిన యొక మహానుభావునియొద్దకుఁ దీవ్రవైరాగ్యసంకలితుండగు నొక జిజ్ఞాసు వేగుదెంచి, మిక్కిలి భక్తిప్రపత్తులతో శుశ్రూష లొనర్చుచు వానివలన ననేక పరమార్థరహస్యము లెఱింగి చాలకాలమైన వెనుకఁ దెలియఁదగిన తత్త్వముఁ దెలిసికొంటినని సంతసించి గురునకు సాష్టాంగప్రణామం బొనర్చి, "స్వామీ! సెలవుఁదీసికొందు"నని యనుజ్ఞకొఱకు వేఁడెను. గురుఁడు చిఱునగవు నవ్వుచు "నార్యపుత్రా! నీవు నేర్చుకొనవలసినదంతయు నేర్చుకొనలేదు. ఇంకఁ గొంతకాలముండి విద్యను బూర్తి చేసికొని వెడలుదువుగాక" యనెను. శిష్యుఁడట్లె యుండుట కొప్పుకొని యాగిపోయెను. గురుకటాక్షముచే నానాఁటి కాతనికి విజ్ఞానముకలిగి, యవిద్యనశించి తత్త్వదర్శనమాయెను. అతఁడాత్మద్రష్ట యయ్యెను. అతనిహృదయగ్రంథి వీడిపోయెను. అతని మనస్సు ఛిన్నసంశయమయ్యెను. ఎక్కడఁ జూచినను దానే. తాను లేనితావు కానుపించలేదు. సకల ప్రపంచము నావరించినవాఁడై, తనయందే సకలము నిండినవాఁడై, దేశకాలవస్తువులచే బద్ధుఁడుగాక మెలంగుచుండెను. ప్రపంచమందలి ప్రతియణువునందును దానె నిండియున్నప్పుడు తాను వేఱొకస్థలమునకుఁబోవుట యెట్లుతటస్థించును? వానికి రాకపోక లనునవెక్కడ నున్నవి? ఒకఁడు కాశినుండి గయకు

బోవుచున్నాఁడనఁగ, గయయందతఁడు లేకపోవుటయు, ఇప్పుడు వెళ్లుటయు సిద్ధించుచున్నవి. నీవులేని స్థలమే లేనప్పుడు, కాశీ గయల రెండింటను నీవది యుండక యున్నప్పుడొకచోటికి బోవు టెక్కడ? ఒకచోటికి వచ్చుటెక్కడ? దేశకాలములచేతను, రూపనామములచేతను, నబాధ్యుఁడైన యాతఁడు గురునకు నమస్కరింపలేదు. సెలవుఁ గైకొనలేదు. గురునియందాతనికిఁ గృతజ్ఞత లేకపోలేదు; కాని కృతజ్ఞత, కృతఘ్నతలను భావముల కతీతుఁడగుటచే గురునితోఁ జెప్పకుండ వెళ్లిపోయెను. గురుడు కడుసంతసించెను. ఆతనియుపదేశముల సారమును శిష్యుఁడు పూర్తిగ గ్రహించెనని గురునకుఁ బరమానందము కలిగెను. ఇది మన పరమావధి. మనుష్యుని శరీరధారిగా నెంచి యెప్పుడు గౌరవించుచున్నామో, యప్పుడాతని నగౌరవపఱచుచున్నామ నుటే. నేను దేహమునా? ఈపదములున్న యీ శరీరమే నే న? కాదు కాదు. ఈప్రపంచమంతయు నాదే. నేను సకలవిశ్వ మయుఁడను. అన్నిలోకములు నే నాక్రమించియున్నాను. నీలో నున్నవాఁడను నేనే. నేను నా ప్రతిబింబమును నీలోఁ గాంచు చున్నాను. ఇట్లు తత్త్వమును దెలిసికొన్నవానికి రాగద్వేష ములు లేవు. మానావమానము లర్థవిహీనములు. అతనికి శరీర గౌరవము తృణీకార్యము. ఆత్మగౌరవము ప్రధానము. వానికే సంపూర్ణస్వాతంత్ర్యము. స్వారాజ్యము వానికి హస్తగతము.

పూర్వమొక మహాజ్ఞానికడ కొకమహారాజేతెంచి యాతనికి సాష్టాంగవందనంబొనర్చెను. "నాకెందులకు వందన మొనర్చుచుంటి"వని యాతఁడడుగ "నోస్వామీ! తమరు పూర్వ

మేలుచుండిన రాజ్యమును సర్వము విసర్జించిన మహాత్యాగుల గుటచేఁ దత్త్వజ్ఞానసముపార్జనకొఱకు నాత్మాశ్రమస్వీకార మొనర్చిన మహానుభావులగుటచే, మీరు నాకు వందనీయుల గుట నట్లొనర్చితి" ననెను. "అట్లయినచో నోరాజా! యీలోకములోని సన్యాసు లందఱికంటె నీవే గొప్పవాఁడవు. ఏలన నీవు విసర్జించినంత యధికపదార్థ మెవ్వా రింతవఱకుఁ ద్యజించియుండలే" దని యా జ్ఞాని బదులు పలికెను. "మహానుభావా! మీ మాటలు నా కర్థము కాలేదు. నే నందఱికంటె మహాత్యాగినని పలుకుచుంట యత్యాశ్చర్యకరముగ నున్నది. నే నేమియుఁ ద్యజింపనిదే నన్నేల యాకారణముగఁ గొనియాడెదరు! మీ యభిప్రాయ మెఱింగింపు"డని వేఁడుకొన నాఋషిసత్తముం డిట్లు చెప్పెను: "రాజా! చూడుము. ఒకఁడొక మేడలోఁ గాపురముండె ననుకొనుము. అతఁడు ప్రతిదిన మిల్లుఁ దుడిపించి, యూడ్చిన పెంట నావలఁ బారపోయును. అతఁడు త్యాగి యనిపించుకొనునా? అతఁ డింటిని వదలి పెట్టి, దుమ్ము మూఁటకట్టుకొని, తెట్టుకుస్తలలో వీథులలోఁ దిరుగుచున్నా డనుకొనుము. అప్పు డాతఁడు నిజమైన త్యాగి యనిపించుకొనునా?" "పెంటమూఁట కట్టుకొని మేడనువదలినవాఁడే నిజమైన త్యాగి యనిపించుకొను" నని యారా జుత్తర మిచ్చెను.

"మంచిది. అట్లయినచోఁ జూడుము. పరమాత్మయగు భగవంతుఁడు నిజమైన మేడ. అదియే స్వర్గము. అదియె సౌఖ్యనిలయము. శరీరము పెంటకుప్పవంటిది. ధూళివంటిది. నీ వా ధూళిని గట్టిగఁ బట్టుకొని భగవంతుని, బరమాత్ముని విడిచి

పెట్టితివి. నీ వంటుచే త్యాగులలో నుత్తముఁడవు. కావున నీవే మాకు వందనీయుఁడవు. మే మేమివిసర్జించితిమి? దుమ్మును విడిచితిమి. ఆత్మను స్వర్గమందిరమును జేపట్టుకొని యుంటిమి.” ఈమాటలను వినుసరికి రాజునకుఁ దన యవ్యక్తత యెఱుక పడెను. అంత నాతఁడు సిగ్గుచేఁ దలవంచికొని వెడలిపోయెను.

చూడుఁడు. ఆత్మజ్ఞానులు లోకమునకుఁ బిచ్చివారివలె గనఁబడుదురు. కాని మీరెన్నిలక్షల ద్రవ్యమునంగీసను వారి యాత్మానందమును, వారిసుఖమును విడనాడుదురేమో కనుఁగొనుఁడు. ఆత్మసుధారసపానోన్మత్తుఁడైన మహానుభావునకుఁ బ్రపంచాధిపత్యమైనను దిరస్కృతమగుచున్నదని మీరెఱుఁగరు కాఁబోలు! ధనముకొఱకు మీరలొనర్చు కయ్యాటములఁ గని వారు నవ్వుకొనుచున్నారు సుఁడీ! మీహృదయములలో నానందమను పెన్నిధియుండ దానికొఱకెచ్చటనో పాకులాడ నేల? లెండు! మేల్కొనుఁడు! సచ్చిదానందస్వరూపులగు మీరు మీ స్వస్వరూపజ్ఞానమునుఁ బొంది సర్వదా పరమానంద లహరియందు దోలలాడుఁడు.



ఓం. ఓం. ఓం.

సమాప్తము.

— చెరువు రామకృష్ణరావు.